...థ గ్రంథ రత్నాకరము ౬ వ అనుబంధము.

# ప్రేమ





అనువాదకర్త్రి:

శ్రీమతి గుడిసేవ నాగమణిదేవిగారు.

G. Venkatachelam. Date 4/11/26

ఆంధ్ర గ్రంథ రత్నాకరము ౬ వ అనుబంధము.

# ప్రేమ




మూలలేఖకులు :

శ్రీ బాబూ అశ్వినీకుమారదత్త, యం. ఏ., గారు.

అనువాదకర్త్రి :

శ్రీమతి గుడిసేవ నాగమణిదేవిగారు.

ఆంధ్ర గ్రంథ రత్నాకర కార్యాలయము.

గుడివాడ.

1926

శ్రీ జీవన గ్రంథాలయము ము-

[illegible] ద్రా [illegible]



చందాదార్లకు 4½ అణాలు. ఇతరులకు 6 అణాలు.

# విషయసూచిక







# భూమిక

ఈశ్వరుఁడు ప్రేమస్వరూపుఁడు. మానవుఁడు ఈశ్వరాంశ సంభూతుఁ డగుటంజేసి మానవునియందు ప్రేమతత్త్వ మిమిడి యున్నది. ఎవఁడు తన సాధనచే నిగూఢమైయున్న ప్రేమను ప్రజ్వలింపఁ జేసికొనునో వానియందు ప్రేమ సంపూర్ణవికాసముఁ జెందును. ప్రేమ వికసించినకొలఁది మానవుఁడు స్వార్థమునువీడి మానవసేవాపరాయణుఁడై మోక్షపదవి నొందును. ప్రేమోపాసకుఁడు ఆత్మవత్ సర్వభూతాని అనెడు స్మృతివాక్యమును ఆచరణయందుఁజూపి పరుల కష్టములు తనవిగ భావించును. ప్రేమ క్రమవికాసము నొందినకొలఁది స్వార్థము నశించి తద్వారా తన కుటుంబమును, సంఘమును, దేశమును అతిక్రమించి విశాల విశ్వమానవకోటియొక్క భ్రాతృభావమును ప్రేమస్వరూపియగు ఈశ్వరుని పితృభావమును పొందును. ఎవఁడు ప్రేమను ప్రజ్వలింపఁ జేసికొనఁజాలఁడో వాఁడు పరుల కష్టములకై పాల్గొనఁజాలఁడు. వానికి స్వర్గతుల్యమగు సంసారము దుఃఖసాగరము. కన్నులుండియు వాఁడు అంధుఁడు. చెవులుండియు వాఁడు బధిరుఁడు. భావనాశక్తిగలిగియు వాఁడు జడప్రాయుఁడు. నవఖండ రాజ్యాధిపత్యమును వహించియు వాఁడు అకించనుఁడు. అత్యంత బల సంపన్నుఁ డయ్యును దుర్బలుఁడు. శారీరక రోగవర్జితుం డయ్యును నిత్యరోగి. తరుగుల్మలతాదుల యందును, కలకలారావమునఁ బ్రవహించు సుందరగిరి నిర్ఝరిణులందును, పశుపక్ష్యాదులందును సర్వమానవప్రపంచమందును తాండవమాడు ప్రేమ

స్వరూపమును గాంచఁజాలనివారి జీవనము వ్యర్థము. పరమేశ్వరుఁడు ప్రేమస్వరూపుఁడు. ప్రేమోపాసకులే నిజమగు ఈశ్వరోపాసకులు. ప్రేమి ప్రత్యణువునందును ప్రేమస్వరూపుఁడగు పరమేశ్వరుని దర్శించుచున్నాడు. ప్రేమి హృదయము ఆనందపూరితము. కామ క్రోధ ఈర్ష్యాదుల కందు స్థానములేదు. ప్రేమి హృదయము విశాలము. జాతి మతవర్ణ ఇత్యాది సంకుచిత భేదభావముల కందు తావులేదు. యువకు లిట్టిపవిత్రప్రేమ నభ్యసించిననాఁడే దేశము, జాతియు నున్నతిశిఖరము నధిష్ఠించును. ప్రస్తుతకాలమున ఉత్తమశిక్షా అభావముచే పెక్కుయువకులు వాస్తవికప్రేమ నెఱుంగఁజాలక కుల మత కక్షలకు లోనై ఆర్యావర్తమును కలహములచే కల్లోలపరచుచున్నారు. ప్రస్తుత పరిస్థితులను పరికించి యువకులయందు వాస్తవికప్రేమ వికాసము లేక తమ భవిష్యత్తును పాడుచేసికొనుటకుఁ జాలిజెంది సుప్రసిద్ధదేశభక్తులును, భక్తియోగ కర్మయోగాది బహు గ్రంథ ప్రణేతలును అగు శ్రీ బాబూ అశ్వినీకుమారదత్తుగారు బారిసాలులోని బ్రజమోహన విద్యాలయమందలి బాంధవసమితివారి కోరికచే మూఁడుపన్యాసములిచ్చిరి. వానినే పై సంఘమువారు ప్రేమయము పేర వంగభాషలో నొక గ్రంథమును ప్రకటించిరి. దానిని శ్రీ పురుషోత్తమదాసు లోహియాగారు హిందీభాషలోని కనువదించిరి. ఆయుపదేశములు భారతీయవిద్యార్థులెల్లరకును ఆచరణీయములే యగుటచే ఆంధ్రలోకమునకెల్ల అందజేయుటకు నేను నానేర్చినకొలఁది తెలుఁగులోని కనువదించితిని. ఇందు శ్రీ లోహియాగారి గ్రంథము నాకు సాయపడుటచే వారిక నే నెంతయు కృతజ్ఞురాలను.

నాయెడ పుత్రికావాత్సల్యముతో నాకు హిందీభాషను గరిపి ఈ గ్రంథము ఆంధ్రములో అనువదించుటకు తగినంత జ్ఞానము ప్రసాదించినట్టి మద్గురువర్యులును ఆంధ్రగీర్వాణ భాషా పండితులై వంగ, హిందీభాషలయందుగూడ అసమానప్రతిభావంతులై తమ సహజశాంత సత్య సద్గుణంబులచే గుడివాడ పురంబున హిందీప్రచారము చేయుచు సర్వజనపూజ్యులైన శ్రీయుత సంధ్యాల శివన్న శాస్త్రిగారికి నా కృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచున్నాను. ఇయ్యది అనువదించుటలో భావములు చెడకుండునట్లు భాషను సరిచూచి ప్రచురమునకు ప్రోత్సాహపరచిన గురుమహాశయునకు ప్రేమస్వరూపియైన పరమేశ్వరుడు ఆయురారోగ్యము లొసంగుగాక.

అనువాదిక :

గుడిసేవ నాగమణిదేవి.

---

# శుద్ధపత్రిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 20 | సానము | స్థానము |
| 7 | 7 | నవచ | దీనవచ |
| 13 | 5 | ఐశర్య | ఐశ్వర్య |
| 16 | 21 | పేరిమిపేరిమముల | పేరిమకరిమముగ |
| 21 | 9 | విషయ | విషమ |
| 22 | 24 | దగ్గఱకు | దగ్గఱకురా |
| 25 | 2 | వివ | విహ |
| 27 | 8 | లుము, | లును |
| 27 | 14 | చెందును | చెందదు |
| 34 | 6 | ప్రపాదు | పరిపాదు |
| 37 | 9 | ప్రాకృతి | ప్రాకృతిక |
| 42 | 1 | గలదు | గలఁడు |
| 42 | 7 | శనుము | శమము |
| 42 | 14 | స్మృతశ్య | స్మృత్యశ |




## ప్రస్తావన



ఈకాలమున దుష్టులు ప్రేమపేర సర్వనాశకరమగు వస్తువును అమ్ముచున్నారు. యువకులు అజ్ఞానముచే దానినే కొనుచున్నారు. ప్రేమపేర మోహమును అమ్ముచున్నారు గాన స్వానుభవముచే యువకులను జాగరూకులఁజేయుట నాకర్తవ్యముగా నెంచి నేను ఈవిషయముపై విమర్శనము చేయుచున్నాను.

ఈ ప్రపంచములో అమూల్యమును సత్యమును అగు ప్రేమ స్వర్గమునుండి వచ్చుచున్నది. ప్రపంచమును స్వర్గముగా పరిణమింపఁజేయుటకై ప్రేమస్వరూపి యగు పరమేశ్వరుఁడు దానిని పంపుచున్నాఁడు. మనము దానిని పుట్టింపఁజాలము. ఇది బజారులో అమ్ము వస్తువును గాదు. ఆనందభవనమునకుఁ జెందిన ఈపదార్థము ఆనందభవనమునుండియే వచ్చుచు, మానవకోటిని ఆనందభవనమునకే కొంపోవుచున్నది.

ప్రేమచేతనే ప్రపంచము సృజింపఁబడినది. ప్రేమచేతనే వాయువు వీచుచున్నది. ప్రేమచేతనే జలము ప్రవహించుచున్నది. ప్రేమచేతనే భూమి నాటఁబడుచున్నది. ప్రేమచేతనే మనకు భోజనసామగ్రి వచ్చుచున్నది. మనమెల్లరము ప్రేమస్వరూపిణి యైన పృథ్విపై నివసించుచున్నారము. ఇట్లుండియు ప్రేమ ఎట్టిదో తెలిసికొనలేకున్నాము. ఇది తెలిసికొనుటయు సహజము గాదు.

ఎవ్వనిపాదకమలములనుండి పాపహారిణియగు పవిత్రభాగీరథి ప్రవహించుచున్నదో ఆయనను ప్రేమస్వరూపము దెలియక మనము తెలసికొనఁజాలము.

పరమపితయగు పరమాత్మ ఇష్టపడనిస్థానమున ప్రేమ నిలవఁజాలదు. పరమాత్మయే ప్రేమకు మూలము.

నవయువకులారా! మీ ప్రేమకు మూలమున భగవంతుఁడున్నాఁడో లేదో కొంచె మాలోచించి చూచుకొనుఁడు. మఱియు మీ రెవనిని ప్రేమించెదరో వానితో భగవద్విషయమై ప్రసంగించుటకు మీకు కోర్కె జనించునా? మీపరస్పరప్రేమ పవిత్రతతోఁగూడినదేనా? విచారించుకొనుఁడు.

ఎచ్చట పవిత్రత లేదో అచ్చట ప్రేమయు శూన్యము. ప్రేమ అతిపవిత్రమైనది. కావున పవిత్రత లేకున్న ప్రేమకు స్థానము లేదు. ప్రపంచమునందు కళంకితమైన ప్రేమకు ప్రేమ యను నామము చెల్లదు.

తలంచు నవయువకులు కళంకపూరితమైన మోహామునే ప్రేమయని పిలుచుచున్నారు. మూర్ఖులగు నవయువకులు ఈ మోహవ్యాపారముసేయు దుష్టులమోసమునకు లోనయి ఇట్లు చేయుచున్నారు. ఈదుష్టులు సరియైనవస్తువని చెప్పి మాయ వస్తువును అమ్ముచున్నారు. ప్రేమను దాంపత్యప్రేమ, మిత్రత, సోదరత్వము మొదలగు సుందరనామములతో అలంకరించి కామమును మోహమును ఎదుట నుంచుచున్నారు. అజ్ఞానులైన నవయువకులు కృత్రిమప్రేమానందమందు మగ్నులై దానిని స్వీకరించుచున్నారు.

మంచిసరకునందును మాయసరకునందును ఏమిభేదమున్నదో చూపుటయే మాకర్తవ్యమైయున్నది. మంచిసరకునందు ప్రేమరాజ్యాధిపతియొక్క మొహరు ఉండును. ఎక్కడ ఈశ్వరునియొక్క చిహ్న ముండదో దానిని ఎప్పుడును స్పృశింపవద్దు. ప్రతిస్వర్గీయపదార్థమందును ప్రకాశించు అక్షరములతో ఆయన మొహరు ఉండును. దుష్టులు దీనినికూడ అనుకరించెదరు. పవిత్రతయను పేరుతో అపవిత్రతను సిద్ధపఱచెదరు. కొంచెమాలోచించిచూచిన ఆపాపప్రేమయను నల్లనిమచ్చ గోచరించును. ఈమచ్చ పెరిగిపెరిగి జీవితమంతను నాశము చేయుచున్నది. తుదకు ప్రాణమునుగూడ హరించుచున్నది.

నవయువకులారా! మీ పరస్పరప్రేమలో ఆ నల్లనిమచ్చ దాగియున్నదో లేదో పరిశీలించుట మీ ప్రాణరక్షణమునకావశ్యకము. అది యున్నచో మీరు సైతానువలలోఁ బడితి మనుకొని, సత్యప్రేమ నొసంగుటకై పరమపితయగు భగవంతుని

ప్రార్థింపుఁడు. ఈశ్వరా! ఈ కపటప్రేమనుండి మమ్ము రక్షింపుము. పవిత్రతతో నిండిన సత్యప్రేమను మాకొసంగుము. అని పరమాత్మను ప్రార్థించుటచే పాపప్రేమ దానియంతటదియే నాశమగును. పవిత్ర సత్యప్రేమ మీ హృదయమునఁ బ్రవేశించును. దానిచే మీయాత్మ ప్రసన్నమగును. మీజీవితము సఫలమగును.

నవయువకులారా! ఎవరిని మీరు ప్రేమించెదరో, వారి ముఖమును జూచుటచే మీకు పరమేశ్వరుఁడు స్మరణకు వచ్చుచున్నాఁడో లేదో తిలకింపుఁడు. నేను మీకు క్రమముగా ప్రేమయు, దానిని సాధించు నుపాయములను దెలిపెదను. మీరు ఎల్లప్పుడు ప్రేమవిషయమై ఆత్మపరీక్ష చేయుచుండుఁడు. మీ ప్రేమి మీ యాత్మశక్తిని నష్టము చేయుచున్నాఁడా? మీకర్తవ్యపాలనాభిలాషను తగ్గించుచున్నాఁడా? అతని సంయోగముచేఁగాని, వియోగముచేఁగాని, మీ హృదయ మెక్కువ వ్యాకులపడుచున్నదా? అతనితో అనుచిత సంబంధము పెట్టుకొనుటకు మీ కిచ్ఛయగుచున్నదా? అతఁడు మిమ్ము ప్రేమించినటులనే మఱియొకరిని ప్రేమించినచో మీ హృదయమున ఈర్ష్య గలుగుచున్నదా? బాగుగ విచారింపుఁడు. మీ యాత్మశక్తి నష్టమైనఁగాని, మీకర్తవ్యమునకు విఘాతము కలిగినఁగాని, మీహృదయము మిక్కిలి వ్యాకులమయినఁగాని, అనుచిత సంబంధముపై నిచ్ఛగలిగినఁగాని, ఈర్ష్య గలిగినఁగాని, మీ యీప్రేమ కళంకభూయిష్ఠమని తలంపుఁడు.

ఇది సత్యమును పవిత్రమును అగు ప్రేమ గాదు. ఈకళం

కమును తొలగించుటకు గట్టిగా ప్రయత్నింపవలయును. దీనికై ఆత్మనిగ్రహ మావశ్యకము.

మఱియొకమాట చెప్పి ఈ ప్రకరణము ముగించెదను. ఏ ప్రేమ ఆపాదమస్తకము పవిత్రతతో నిండియుండలేదో అది నిజమైన ప్రేమ గాదు. ఆ ప్రేమ ఒకదమ్మిడి విలువగూడ చేయదు. అట్టి ప్రేమ లేకయుండుటయే మంచిది. అపవిత్ర ప్రేమ - కెప్పుడును హృదయమున స్థానమీయరాదు. ఈ మోహమును మద్యమును త్రాగుటచే నవయువకుల ప్రవర్తన మపవిత్ర మగుచున్నది. దీనిచే సమాజమందలి మంచిమంచి బాలురు చెడిపోయినారు. పెక్కు యువకులహృదయ మిట్టి యసత్యప్రేమచే నిండుటచే వారికి గంభీరవిషయములపై ఆలోచించు శక్తి నశించిపోయి నది. మెదడు బలహీనమైనది. వారి జీవితమంతయు నిరర్థకమైనది. కొందఱు ఈర్ష్యాగ్నిలో ప్రమ్గి తమదేహమును హృదయమును భస్మముచేసికొనిరి.

బీజము నాటగనే మొక్క మొలచి దానికి రెండుమూడు ఆకులు వేయగనే తోటమాలి యెంతయో ఆనందపడెను. క్రమముగా నీచెట్టు పెద్దదగుననియు, వందలకొలఁది మనుష్యులు దీనినీడను గూర్చుండి యానందించెదరనియు వాఁడు తలపోయు చుండెను. కాని పాపము చూచుచు చూచుచుండగనే యొక విషవాయువు ప్రసరించుటచే దానియాకులు రాలిపోయెను. మనోహరమగు నా చిన్నివృక్షము వాడిపోయెను. ఇట్లే ప్రతిబాల కునిమూర్తిని జూచి ఎన్నియో అభిలాషలు వహింపుచుందుము. ప్రతిదినమును వానిశారీరిక మానసికనైతి కాభ్యున్నతి గోచరిం

చుచుండును. ఒకనాఁడు ఈబాలకునివలన వేలకొలఁది మానవులు సుఖపడెదరనియు ప్రపంచమునకు కల్యాణము గలుగుననియు ఆశపడుచుందుము. కాని దురదృష్టముచే వాఁడు మోహజాలమునఁ జిక్కుకొనును. మన ఆశలన్నియు మట్టిపాలగును. వాని ఉచ్చవిచారములన్నియు అంతరించును. ప్రతిదినమును రాహుగ్రస్తుఁడగు చంద్రునివలె వాఁడు కళాహీనుఁ డగుచుండును. ఆసాహసము ఆతేజము, ఆశక్తి క్రమముగ క్షీణించిపోవును. ఆఉన్నతి యిపుడు అవనతిగా మాఱును. మనస్సులోని యాశలన్నియు మాయమగును. వాని బ్రదుకును చావును ఒక్కటిగనే యుండును.

సమాజమందలి బాలు రిట్టి దురవస్థ నొందకుండుటకును వారు మోహజాలమున పడకుండుటకును నేను మాటిమాటికిని చెప్పునదేమన **మీరు** ప్రేమించుటకుముందు ఆత్మపరీక్ష చేసికొనుఁడు. భగవత్ప్రేరితమైన శుద్ధసత్యప్రేమను గ్రహింపుఁడు. దానిచేతనే మీరు మీజీవితమును గడపుఁడు. పరమపితయగు పరమాత్మ మీకు తోడుపడుగాక.

# ప్రేమలక్షణములు.

ప్రేమాభిలాషులగు నవయువకులారా! **మీరు** ప్రేమను నేర్చుకొనఁగోరినచో, ప్రేమామృతమును త్రాగఁగోరినచో, ప్రేమయననేమియో తెలిసికొనఁగోరినచో, ఆప్రేమసాగరమున మునుఁగవలయును. ఆసాగరోదకమును త్రాగవలయును. ఆస

ముద్రమున ఈదవలయును. ఏలయన ఆసముద్రమునందెక్కు మఱియెచ్చటను ప్రేమ లేదు. ఆసముద్రమున ఎంత జలము త్రాగెదరో, ఎంతఎక్కువ ఈదెదరో, ఎన్నిమునుకలు వేయుదురో అంతప్రేమయే లభ్యమగును. మీరు బజారులో చూచు ప్రేమ నిజమగుప్రేమ కాదు. కామము, మోహము ప్రేమ యనుపేర అమ్మఁబడుచున్నవి. ప్రేమరాజ్యాధిపతియగు పరమాత్మను ప్రేమభిక్ష యాచింపుఁడు. ఆయనను దీనవచనముల ప్రార్థింపుఁడు. ఆయన కోరినచో మీకు ప్రేమ నీయఁగలఁడు. వేఱుమార్గమున మీకు ప్రేమ లభింపఁజాలదు. సత్యమైనప్రేమ లభించినపుడు కామమోహములు తొలఁగిపోవును. సత్యప్రేమకై మీరా ప్రేమసాగరమున మనస్సును ముంచుఁడు. ఆజలము శరీరమునకు తగులఁగనే నలుప్రక్కలను ప్రేమ గనిపించును. స్వర్గమందును, పృథ్వియందును, ఆకాశమందును ఎక్కడఁజూచిన అక్కడనే ప్రేమ గనుపించును.

సత్యమైనప్రేమ కేవలము పరమపితయగు పరమేశ్వరుని గృహమునుండియే వచ్చునని నేను తొలుతనే చెప్పితిని. అది ఆయన యింటనుండువస్తువు. దానిపై స్వర్గపుమొహరు ఉండును. ఆమొహరులో నేమేమి యుండునో ప్రేమలక్షణము లేవియో అదియే ముందు తెలిపెదను.

ప్రేమయందు ఆనందము, నిత్యత్వము, నూతనత్వము, ఔన్నత్యము, సర్వవ్యాపకత్వము, స్వార్థరాహిత్యము ఈగుణము లవశ్య ముండును. ప్రేమలో గొప్పయానంద ముండును. మధుర రసపూర్ణమును సత్యమునగు ప్రేమ ఆనందదాయక మగుచున్నది.

ప్రేమస్వరూపుఁడే ఆనందస్వరూపుఁడు నగును. ఆయా నందమునకు అంతము లేదు. అది యగాథము. ఎవ్వని ప్రేమించె దరో వానిని చూచుటచే ఆనందతరంగము లుత్పన్నమగును. వాఁడు స్మరణకు వచ్చినపుడు హృదయము ఆనందమయ మగు చున్నది. ప్రేమయే ఆనందముయొక్క రూపమగుటచే వాని హృదయము ఆనందముచే నిండిపోవుచున్నది. వానికి సుఖమం దును దుఃఖమందునుగూడ ఆనందము గలుగుచున్నది. దుఃఖ సమయమున ప్రేమితలఁపునకు వచ్చుటచేతనే దుఃఖము తగ్గిపోవు చున్నది. పరమాత్మపై ప్రేమగలవానికి మృత్యువునందుసైతము ఆనందము కలుగుచున్నది. ఏమన ప్రేమయొక్కయు, ఆనందము యొక్కయు ఇచ్ఛచేతనే మృత్యువు కలుగుచున్నది. ఇంక దుఃఖ మెందుకు?

"ఆనందాద్ధ్యేవ ఖల్విమా-ని భూతాని జాయన్తే, ఆనన్దేన జాతాని జీవన్తి, ఆనందం ప్రయ న్త్యభిసంవిశన్తి"

ఆనందమువలననే ప్రతిప్రాణియు జన్మించుచున్నది. ఆనం దముచేతనే జీవించుచున్నది. తుదకు మరణానంతరము ఆనంద మందే వెళ్లి కలియుచున్నది. కనుక ప్రేమలీలయే మృత్యువు. నేను చనిపోవుచుంటిని అనఁగా ఆనందమునుండి ఆనందములో నికే పోవుచున్నాను. నా ప్రియమిత్రుఁడు చనిపోవుచున్నాఁడు. అనఁగా ప్రేమస్వరూపుని ఆజ్ఞచే ఆనందములోనికిఁ బోవుచున్నా డు. ఇంక దుఃఖమెందుకు?

ఆనందముకన్న మరియేమియుండును? ఆనందము సర్వము

ఆనందము. ఆపదయందును. దుఃఖమందును, మృత్యువునందును నీకు ఆనందము కలుగనంతవరకు నీవు ప్రేమహీనుఁడవని ఎఱుంగుము. ఎంత దుఃఖమేని వచ్చుగాక నిజమైనప్రేమి భయపడఁడు. ప్రేమానందధార హృదయమున నిండి ప్రవహింపుచుండును. దుఃఖమను వేడిఇసుక హృదయమున చేరగనే అది చల్లఁబడు చున్నది.

నేఁడు ఇంటిలో అన్నము లేదనుమాట వినియు ప్రేమి చింతాగ్రస్తుఁడు కాఁడు. ఏమన వాఁడు సుఖదుఃఖములు రెండును ప్రేమాంతర్గతములని ఎఱుంగును. "నీవును నేనును స్నేహముగా నుంటిమి. ప్రపంచమంతయు మనలను నిందించిన నిందింపనిమ్ము. మనము ఈపనిని పరమప్రియుఁగు పరమాత్మ నుద్దేశించి చేసితిమి" అని ఒకప్రేమి నుడివెను. ఈమాటలు ప్రతిప్రేమికిని చెల్లును. కష్టము, ఆపద, శోకము, దుఃఖము మఱున్నగు అన్ని దశలయందును "నేను పరమాత్ముని ఒడియందే దాఁగియున్నాను అనుకొని, ప్రేమి ఎల్లప్పుడును ఆనందములో నుండును. ఆపదలు హెచ్చినకొలఁది వాని ఆనందము హెచ్చుచుండును. ప్రేమియగు మయూరము ఆకాశమున మేఘుని జూడగనే పింఛమువిప్పి యాడును. ఆపదలో ప్రేమి వికాసముఁజెందును. నీవు నన్ను ప్రేమించుచున్నదియు లేనిదియు ఆపదయందే తెలిసికొనఁబడును. అట్లే నీకు కష్టముగలిగినప్పుడు నేను నిన్ను ప్రేమించు చున్నదియు లేనిదియు తెలియఁబడును. మహాత్ముఁడగు క్రీస్తు సిలువపై ప్రాణములు బాయనున్నపుడు ఆయనకు తనప్రేమను చూపించుటకు మంచి యవకాశము చిక్కినటుల ఆయన జీవితములో మఱి ఎన్నఁడును చిక్కియుండలేదు. గనుకనే ఆయన

తనమృత్యుసమయమునందును వ్యాకులుఁడు కాలేదు. ప్రహ్లాదుఁడు ఏనుఁగుచే త్రొక్కింపఁబడు నప్పుడును ఆనందముచే నాట్యము చేయుచుండెను. ఆయన పరమాత్మను ప్రేమించుచుండెను. గనుకనే ఏనుఁగు కాళ్లక్రిందఁబడినను ఆయన ప్రేమానంద మెచ్చటకుఁ బోవును? ఆపద యనుభవించునపుడు మనుష్యుఁడు మేలిమిబంగార మగుచున్నాఁడు.

యథా సహస్రధాధ్మాతే న మలం కిల కాంచనే

వేలకొలఁది పుటములు పెట్టుటచే సువర్ణము నిర్మలమగునటుల మానవుఁడుఁ పలుమాఱులు దుఃఖాగ్నియందు తప్తుఁడైనపుడు నిర్మలుఁడగును.

పరమపితయగు పరమాత్మ దుఃఖాగ్నియందు తపింపఁజేసి ప్రతిమానవుని సువర్ణమునువలె నిర్మలుని చేయుచున్నాఁడు. ఇటువంటిదుఃఖమందును, ఆనందమందును తనప్రేమ నిర్మలసువర్ణమగుట ఎఱింగి ఎవ్వని మనస్సు ఆనందమగ్నము గాదు? గాన నిజమైనప్రేమి హృదయమునందు సుఖదుఃఖములందును, సంపద్విపదలయందును ఎల్లప్పుడు ఒకయానందమే ప్రవహించుచుండును. నీప్రేమియొక్క దుఃఖమునందు నీకు స్థిరమగు ఆనందము కలుగనిచో అస్థిమాంసమయమగు ఈశరీరమున ఈస్వార్థపంజరమున కామమోహములు నిండియున్నవని యనుకొనుము. ఇది నిజమైన ప్రేమ కాదు. పైనచెప్పిన దోషములు నీయందున్నను ప్రేమసాగరమునుండి నిజమైన ప్రేమను సంపాదించితినని నీవనుట ఉచితము కాదు. ప్రేమ ఎల్లప్పుడు అవికృతమై యుండును. అది

సాంసారిక సుఖదుఃఖములందు కట్టుబడదు. ప్రేమనిత్యము. అది అధికానందముచే హెచ్చదు. ఘోరదుఃఖములచే తరుగదు. ప్రేమస్వరూపావలంబనముచే ప్రేమ ఎల్లప్పుడు నిత్యమైయుండును.

సత్యప్రేమ ఆత్మయందుండును. ప్రేమకు నివాసము ఆత్మగాని శరీరము కాదు. ఆత్మ అవినాశి గనుక ప్రేమయు అవినాశియే. శరీరసంబంధముగల ప్రేమ ప్రేమకాదు. అది మోహము. నీవు సాధారణముగా దేనిని ప్రేమ యందువో అది మోహము. జడపదార్థములందు ప్రేమ యుండదు. అస్థిచర్మమాంస రుధిరములకు చెందిన ప్రేమ ప్రేమకాదు.

నే నొకబాలికను జూచితిని. ఆమె ప్రేమచే ఒక్కనినే తండ్రి, తల్లి, పినతండ్రి, పినతల్లి మున్నగు అనేకనామములతో పిలుచుచుండెడిది. ఒకనాడు ఒకడు నీకు స్త్రీపురుషభేదజ్ఞానము లేదా యని ఆమె నడిగెను. అందు కామె 'అయ్యా! నేను ప్రేమించుపదార్థము స్త్రీయు కాదు, పురుషుడును గాదు. అది ఈ బాహ్యశరీరమునందున్నదా? అని పలికెను. ఆమె జబాబును విని మేము విస్మయము జెందితిమి. ఆబాలిక సత్యప్రేమను ఎఱింగెనని నాయభిప్రాయము. ఇట్టిది గనుకనే ఆమె చిన్నతనమందే పరమపదించెను. ఆబాలిక తలపునకు వచ్చునప్పుడు నిజమైనయానందము కలుగును.

నీవు ఎవనిని ప్రేమించెదవో వాడు నిజముగ ప్రేమపాత్రుడగునా కాదా యని పరీక్షించి, నీప్రేమ శరీరసంబంధియా, మరణానంతరమును నీ వతనిని అట్లే ప్రేమించెదవా? విచారించు

కొనుము. మఱియు నీవు ప్రేమియొక్క ముక్కు, చెవులు, మొగము, కన్నులు మున్నగు అవయవములసౌందర్యమునే విచారించుచుందువా? అతఁడు దేశక్షేమమునకై నిన్ను ఎడబాసిన నీకు బాగుగనుండునా, లేక అతఁడు దేశక్షేమమును పాటింపక ఎల్లప్పుడు నిన్ను అంటియుండి సరససల్లాపము లాడుచుండిన బాగుగనుండునా? యోజించుకొనుము. అతనితో కలసియుండుటకును, ప్రేమ ప్రసంగము చేయుటకునే యిచ్ఛయుండినచో అది ప్రేమకాదు, మోహము. అది అమృతము కాదు, విషము. అని నిర్ణయించుకొనుఁడు.

మహాభారతములో విదులోపాఖ్యానమందు సత్యప్రేమనుగుఱించిన ఒకసుందరదృష్టాంతము గలదు. విదుల రాజమాత. ఆమెకు సంజయుఁడను నొకకుమారు డుండెను. సింధురాజు అతని రాజ్యము హరించినపుడు అతఁడు నిరాశుఁడు, దుఃఖితుఁడును నై నిద్రించుచుండెను. విదుల వానికి ఉత్సాహము గూర్చుచు నిట్లు చెప్పెను—కుమారా! నీవు నిర్జీవమగు జడపదార్థమువలె ఏల నిద్రించుచుండెదవు? లెమ్ము. పిరికిపందవలె నేల పడియుండెదవు? ఒకమారుఅగ్నిరూపగు కరవాలమును గ్రహించి శత్రునిపై కురుకుము. ఇట్టిబ్రతుకు బ్రతుకుటకంటె చచ్చుటయే మేలు. నీశక్తి కొలఁదిశౌర్యమును జూపింపుము. లేదా చావుము. ఒకమారు నీకులమర్యాదను స్మరించి పోయినరాజ్యమును తిరిగి సంపాదించుము. సోమరిపోతులై పనిపాటులేక జీవితము వ్యర్థముగాఁబుచ్చు దుష్టులతో సహవాసము చేయకుము. అల్లసి నిన్ను ఆదర్శముగాగ్రహించి వేలకొలఁది మనుష్యులు చెడిపోవు

దురు. దిగంతవిశ్రాంతమగు కీర్తినార్జింపని పురుషుఁడు మనుష్య సంఖ్యాపూరణమునకే ఉపయోగించును. ఎవనికి సత్కీర్తి, దానము, తపస్సు, ధర్మము, సత్యము, విద్య, అర్థలాభము వీని యందు ఇచ్ఛ ఉండదో వాఁడు జన్మభూమికి పుత్రుఁడనుటకు తగఁడు. ఎవఁడు శాస్త్రజ్ఞానమున, తపస్సున, ఐశ్వర్యమున, తేజమున అన్యుల నతిక్రమించునో వాఁడే నిజమైన మనుష్యుఁడు. గనుక సంజయా! నీతేజస్సును చూపించుటకై సిద్ధముగానుండుట నీకర్తవ్యము. ఒకమారు అగ్నిగోళమువలె శత్రువులపైఁ బడుము. దానికి సంజయుఁడు 'అమ్మా! నేను యుద్ధములో చనిపోవుచో నీకు సుఖమెక్కడిది? నేను నీపుత్రుఁడను. నేను చనిపోయిన పిమ్మట ఈ భూమండల మంతయు లభించినను నీకేమిలాభము?" అనెను. దానిపై విదుల నాయనా! నేను నీచావుకుగాని, బ్రతుకుకుగాని విచారింపను. ప్రపంచములో ధర్మమునకై జీవింపవలయును. ధర్మనాశమగునపుడు జీవించుటచే నేమిలాభమగును? నీస్థితినిజూచి స్నేహావశీభూతనై నీకు వెళ్లుట కాజ్ఞనీయకున్నచో నాప్రేమ ప్రేమకాదు. విద్వాంసులు ఆప్రేమను భక్తిశూన్యమగు ప్రేమయనియు, పశుప్రేమయనియు చెప్పుదురు. మానవప్రేమ ఇట్లు మోహభరితము కాఁగూడదు అనెను. సంజయుఁడు తల్లిఉపదేశము విని ఆవిధముగా నడుచుకొని తిరిగి తన రాజ్యమును సంపాదించెను.

దీనిపేరు ప్రేమ లేక స్వప్రేమ. విదులప్రేమ నిష్కామము. ఈ ప్రేమ పుత్రుని శరీరమువిడిచి ఆత్మను గ్రహించెను. గనుక ఆమె తనపుత్రుని మృత్యువునకు దుఃఖించుటకు కారణమే లేకుండెను.

ధర్మము నుదరించి పుత్రుఁడు చనిపోయినను ఆనందమే ప్రేమ ఇట్లేయుండవలెను. ఇట్టి ప్రేమయున్నచో ఇహలోకము పరలోకము రెండును సుగమములై యుండును. ప్రేమి ఎచ్చటికేఁ బోవునుః వానిశరీరము ఈలోకమును విడిచిన నేమాయెః నిత్యము అమర్త్యమునగు మనయాత్మ మనదియే అయియుండును. మన చుంబకమును. ఆలింగనశక్తిని తీసికొనుటకు ఎవనికి శక్తి గలదుః ప్రేమి తనహృదయమును ప్రేమచేనింపి ఎల్లపుడు ఆనందముతో నాట్యము సేయుచుండును. నిశ్చలమగు పర్వతశిఖరము పై గృహమును నిర్మించుకొనియు క్రింద రెండుమూఁడు చంచల మేఘములనుజూచి వాఁడెందుకాశ్చర్యపడునుః వాఁడు ఎల్లప్పుడు నూతన సామగ్రిని తీసికొని ఆనందములో మగ్నుఁడై యుండును.

అందు మనమెంతయో నూతన సామగ్రిని జూచుచున్నాము. ప్రేమి ఎల్లపుడు నూతనముగనే ఉండును. ప్రతి క్షణమునందును వానియందు నూతన సౌందర్యము పుట్టుచున్నది. చూడుము. చంద్రుని జనులెంతప్రేమించెదరుః అయినను చంద్రుఁడు ఎప్పుడును ప్రాతఁగిలఁడు. ఎవఁడేని చంద్రునిజూచి 'చంద్రా! నీవు ప్రాతగిలితివి. మలినుడవైతివి. మేము నిన్ను చూడఁగోరుటలేదు' అని చెప్పుటవింటిరాః గులాబిపువ్వు ఎప్పుడేని ప్రాతపడునాః ప్రతిదినమును గులాబిని చూచుచున్నను దానిని చూడవలదు అనుభావము ఎవ్వరికేని కలుగునాః తల్లికి కుమారునిముఖ మెన్నఁడేని ప్రాతబడునాః ఇట్లగుట అసంభవము. ఎవఁడు ప్రేమింపఁబడునో వాఁడు ఎల్లప్పుడు క్రొత్తగనే యుండును. తనప్రేమి ముఖమును జూచునపుడు హృదయమున నవత

రంగము లు ఉత్పన్నములగును. తన ప్రేమి ఏకాంతమున మనస్సొగ్గి తనపని చేసికొనుచుండునప్పుడు అతని ముఖము చూచుకొలంది నవనవ సౌందర్యతరంగములు గోచరించును.

ఏఁబదిసంవత్సరములనుండియున్న మైత్రి ఎన్నఁడేని ప్రాత గిలునా? ప్రాతగిలుచో నది మైత్రియే కాదు. అది మోహము. మోహమున్నంతవఱకు నూతనముగ నుండెడిది. మోహము పోయినవెంటనే నూతనత్వమును పోయినది. పతివ్రతయగు స్త్రీ తనభర్తను జీవనమరణములయందును, ఇహపరలోకములందును నవనవభావములతోడను, ప్రేమతోడను గాంచుచుండును. పితాపుత్రులందును, గురుశిష్యులందును ఇట్టినియమమే యుండును.

ప్రేమ నిత్యమును, నూతనమును, ఉన్నతము నగుచున్నది. ఇది ఉన్నతములగు స్వర్గీయభావములచే నిండియుండును. ప్రేమయందు నీచత్వము, క్షుద్రత్వము ఉండవు ఉన్నచో ప్రేమ వానిని తొలఁగించును. దుర్భావనల తొలఁగించుటయే ప్రేమికి లక్షణము. ప్రేమ ఉన్నతస్థానమునకు పోఁగోరుచుండును. సర్వోన్నతస్థానమున చేరినను మనస్సునందలి యిచ్ఛ పూర్ణము కాదు. ప్రేమిచే మానవునిహృదయమున ఉన్నతభావము లంకురింపవో అది ప్రేమకాదు. ఇరువురుస్నేహితులందు సత్యమైన ప్రేమ ఉన్నదాలేదా యని పరీక్షింపఁగోరినచో, వారియందు ఉన్నతభావము లున్నవాలేవా? వారిసంయోగముచే వారిప్రవర్తనము పవిత్రముగనుండునాలేదా? ఆధ్యాత్మికచింత కలుగునా లేదా? అని విచారింపుడు. అట్లు లేనిచో వారిమైత్రి నిజమయినది

కాదనియు, అది అధఃపతనమునకు హేతుభూతమనియు ఎఱుంగుడు. అప్పుడు వారిరువురను విడదీయుడు. ఏ ప్రేమ స్వర్గమునకు గొంపోవదో దానిని స్వప్నమందైననుదరిచేరనీయవలదు. ఇరువురు మిత్రులకు ఏకాంతమున అనుచితసంబంధము కలదని తెలియుచో వారు దుర్భావములతో నిండియుండిరనియు, వారియందుసద్విచారములు లేవనియు తెలిసికొనుడు. అపవిత్రములు ననుచితానందదాయకములునగు మాటలయందే ఇచ్ఛయుండుచో, గంభీరవిషయములందు వారిమనసు లగ్నము గానిచో వారుసర్వనాశమునకుసిద్ధముగ నుండిరని ఎఱుంగుడు. వారు మృత్యువును తమవద్దకు పిలుచుకొనుచున్నారు. కేవలము వనభోజనమున (Picnic) ప్రేమలేదు. ప్రేమలో వనభోజనము నొసంగుటకు అవసరము లేదు. కాని వనభోజనముతోపాటు ఒండొరులతో ఉన్నతపవిత్రభావములు కలిగించు సామగ్రికూడ నున్నచో స్వర్గము సమీపముగఁ గనుపట్టుచుండును. స్వర్గమున అనుచితముగాని, అసత్యముగాని లేదు. ప్రేమి ప్రేమికుల హృదయమున గుప్తపవిత్రసంకల్పములు కలుగుటచే సర్వసౌఖ్యము కలుగును. అట్టిసంకల్పములు లేనిది ప్రేమగాదు.

ప్రేమయొక్క వైశాల్యము తలఁపునకు వచ్చినపుడు మనసునకు చాల ఆనందము కలుగును. ప్రేమ పరమేశ్వరుని ధనాగారమందలి సామగ్రి గాన ఇది పృథ్విని మ్రింగుటకు పరుగెత్తుకొనివచ్చును. ప్రేమ క్రమముగ విస్తరించుచున్నది. నేడు ఒకసని ప్రేమించుచో వానిమూలమున మఱియొకఁడు ప్రేమింపఁబడును. ఈవిధముగ ప్రేమమండలిని ప్రోగుచేసికొనుటకు అభిలాష

కలుగును. కొలంది కాలములోనె ఒకరికిద్దరు, ఇద్దరికి నలుగురు ఈ విధముగ ప్రేమి సంఖ్య హెచ్చుచున్నది. ప్రేమచర్చ పెరిగిన కొలంది ప్రేమికి ప్రపంచము చాల సుందరముగ కనుపడును. పెక్కుప్రాణులపైగూడ ప్రేమ పొరలివచ్చును. క్రమముగ ప్రేమి సమస్త మానవజాతిని ప్రేమింపగలుగును. తుదకు వాడు మానవునేగాక సమస్త జీవులను, జడపదార్థములనుగూడ ప్రేమించుచున్నాడు. ఆసమయమున పరమపితయగు పరమాత్మ అమృతస్పర్శమును గురిపించును. బుద్ధదేవుని ప్రేమ జూడుము. చైతన్యుని ప్రేమ చూడుము. గాంధిమహాత్ముని ప్రేమచూడుము అది సమస్త ప్రపంచమునందును వ్యాపించియున్నది. నిజమైన ప్రేమికి సూర్యచంద్రులు తమ కిరణములచే అమృతవర్షమును కురియుచున్నటులును, వాయువు అమృతభరితమై వీచుచున్నటులును, నదులు అమృతమును ప్రవహింపుచున్నటులును, మేఘములు అమృతమును వర్షింపుచున్నటులును, పృథ్వి యంతయు అమృత భరితమైనటులును గనుపట్టుచుండును. ఇట్టి స్థితిలో ఎచ్చటకుపోయిన అచ్చటనే మేరలేనిఆనందము కలుగుచుండును అప్పుడు కంటికగపడు ప్రతివస్తువును కౌగలించుకొనుటకు ఇచ్ఛ కలుగును. చెట్లఆకులనుగూడ ముద్దు పెట్టుకొనుటకును, వాయువును జంకనెత్తుకొని ఆడించుటకును, సరోవరములందలి ప్రతిజల బిందువును, చంద్రుని ప్రతి కిరణమును హృదయమున దాచుకొనుటకును కోర్కె గలుగుచుండును, మార్గమందలి పరాగమందు ప్రేమ ఉప్పొంగుచుండును. రాతినుండి ఆనందధార ప్రవహింపుచుండును. ఇట్టిపరిణామము లేకున్న అది ప్రేమగాదు. ఏప్రేమభావములు చిన్నక్షేత్రమందే మిణుకు మిణుకు మనుచుం

డునో అది ప్రేమగాదు. ప్రేమ చిన్న కూపమువంటిది గాదు. అది మహాసముద్రమువంటిది. సముద్రము పృథ్వివై ఎంతదూరము రాజ్యము చేయుచున్నను అది ఎప్పుడును తన కెరటములను చిమ్ముచునేయుండును. అట్లే ప్రేమాభిలాషగూడ అత్యంత మధికమై ఒప్పుచుండును. పృథ్వికి మేరగలదుగాని ప్రేమకు మేర లేదు. ప్రేమ ఎప్పుడును ముందుకు నడుచుచుండును, ఏప్రేమకు ఎన్నటికిని తనివి కలుగదో అట్టిప్రేమను సంపాదింపుఁడు, యువకులారా! మీప్రేమ ఈ విధమున వృద్ధిచెందుచున్నదా? రాముని ఎట్లు ప్రేమించెదరో శ్యామునిగూడ అట్లే ప్రేమించుచుంటిరా? ప్రపంచమండలి సమస్తమానవులను ప్రేమికులనుగ చేసికొనవలెనను అభిలాష మిమ్ము విడువకయున్నదా? ఇతరుల ప్రేమవృద్ధిని జూచి మీకు సుఖము గలుగుచున్నదా? మీప్రేమ మీకెట్టి ఉన్నతాదర్శమును జూపించుచో మీరు దానిని ప్రయత్నపూర్వకముగ రక్షించుకొనుఁడు, కాని మీ ప్రేమలో హింసాభావము గాని, ఈర్ష్యాభావము గాని ఉత్పన్నమగుచో అట్టిప్రేమను కాలితో రాచివేయుఁడు. లేనిచో ప్రేమామృతమునకు బదులు ప్రాణఘాతకమగు విషములభించును. ఒకనినేప్రేమింపుము. అంతకంటె నెక్కువవలదు( Love one love no more) ఇదిసైతానువచనముకాని ఈశ్వరుఁడు చెప్పినదేమన పెద్దకాని చిన్నకాని ఎల్లఱను ప్రేమింపుము. (Love all things both great and small.) ఎవఁడు ఎవనిని ఎంత ప్రేమించిన అంతమంచిది. క్రీస్తు, చైతన్యుఁడు బుద్ధుఁడు, జాన్ పాల్ మున్నగు సర్వదేశీయ మహాత్ములును ఏకగ్రీవముగ జెప్పునది శత్రువునుకూడ ప్రేమింపుమనియే. శత్రువు ఈపృథ్వికంటె భిన్నుఁడా? శత్రు వీప్రేమపూర్ణమగు

రాజ్యమున నివసించుటలేదా? ఇంక నతఁడు శత్రు వెట్లగును? శత్రుత్వమందును ప్రేమమాయ గలదు. ఆతని ఖడ్గమునుండి అమృతబిందువులు వర్షించుటలేదా? శత్రువు నిజముగ మిత్రుడే. అతఁడు అనేకవిధముల ఉపకారము చేయుచున్నాఁడు. ఈప్రేమ రాజ్యమున ఇచ్ఛచేఁగాని, అనిచ్ఛచేఁగాని, ఎవ్వఁడును మేలు చేయక యుండఁజాలఁడు. మన మెవ్వనిరాజ్యమున నివసింపుచు న్నామో ఎఱుఁగుదువా? పేరిమమూలమును నరికివేయఁ గోరు చుంటివి. గాని దానికి ఫలము విపరీతమగుచున్నది. నీవు విషము త్రాగఁగోరు చుంటివి. కాని అది అమృతమే యగుచున్నది. ఇంక నేమి చేయగలవు? అమృతరాజ్యమున నిల్లు యగుచుం డును. యూదులు క్రీస్తును ద్వేషించి అతఁడునాటిన బీజమును అంకురింప కుండునటుల చేయనెంచిరి. కాని ఏమయ్యెను? యూదుల శత్రుత్వమే అతనికి మిత్రత్వముగ ఉపయోగించెను. వారిచే పీడింపఁబడిన యావత్ప్రపంచము క్రీస్తుయొక్క ప్రేమ వృక్షము నాశ్రయించెను హిరణ్యకశిపుఁడు తాను ప్రహ్లాదుని ద్వేషించితిననియు, అత, డింక ప్రేమోన్మత్తుఁడు కాఁజాలఁడ నియు అనుకొనెను. కాని తా ననుకొనినది యొకటియు, అయి నది యొకటియు ఆయెను. హిరణ్యకశిపుఁడు విస్మితుఁడయ్యెను. ప్రహ్లాదుని యున్మాదముచే క్రమముగ ప్రపంచమంతయు ప్రేమోన్మత్త మయ్యెను. మంచివారికి చెడుగు చేయుటయు సులభమైన పనికాదు. మీకును మాకును ఇతరులకును గల పాంస్పరికభేదమును శత్రుత్వమును కన్నులుగలవారు చూతు రుగాక. కాని ఇందు మానవుని ప్రయత్న మెంతయున్నను పర మేశ్వరుఁడు ఇందు ప్రేమను నింపుచున్నాఁడు. మన కీజీవితమం

దే ఇట్టిది చూచుటకు అవకాశము కలిగినది. మానవుఁడు శత్రుత్వమను మేఘమును రచించెను. పెద్దగర్జితము కాసాగెను, భయముచే హృదయము వ్యాకులమగుచుండెను. కాని ఈశ్వరేచ్ఛ వేఱుగ నుండుటచే అందును ప్రేమవిద్యుల్లత మెఱయసాగెను. కుంభపాతముగ వర్షము గురియుచుండెను. శత్రువు తానెంతో ఘనకార్యము చేసితిననుకొనుచుండెను. కాని వానిహృదయమందలి ఈర్ష్య, ఆవేశము, అహంకారము, అభిమానము మున్నగు పాపవాంఛలన్నియు ఆవర్షప్రవాహమున కొట్టుకొని పోయెను. హృదయము శాంతమయ్యెను. సద్భావబీజములు అంకురింపసాగెను. మన మనశ్శాంతికిని పవిత్రతకును హేతువులగు ఇట్టిశత్రువులు చిరకాలము జీవించియుందురుగాక. ఇంక శత్రువును మిత్రుఁడని పిలుచుటకును, వానిని కౌఁగలించుకొనుటకును నీకు ఇచ్ఛ కలుగుచుండును. వానియందు దురాచారములున్నచో వానిని తొలగింపుమని చెప్పుము. పుత్రుని ఆచరణమును చక్కబరచుటకువలె శత్రువుని ఆచరణమును చక్కఁజేయుటకును నీవు తప్పక ప్రయత్నింపవలయును. మరియు ఈవిషయమై శాసనమును చేయవలసియుందువు. ఈశాసనముచే క్రమముగ నాప్రేమ హెచ్చి వానిని ముద్దుగొనుటకు నీకు ఇచ్ఛ కలుగును. అప్పుడు సత్యప్రేమ విజయముగాంచినదని నీవు తెలిసికొనఁగలవు.

ప్రేమకు సర్వప్రధానమగు గుణము ధైర్యము. నిస్స్వార్థప్రేమమున తనది యనియు, పరునిది అనియు భేదముండదు. సర్వము నొక్కటియే. తనఇంటియందే యుండక పరులకు సేవచేయుట

మహాప్రవాహము. నిజమునకు పరుఁడెవఁడు? అందఱు తనవారే. స్వార్థమునకు, ప్రేమకును విరోధము. స్వార్థపరత్వమున్నచోట ప్రేమ యుండదు. ప్రేమయున్నచోట స్వార్థమును ఉండదు. ప్రేమ హెచ్చినకొలఁది స్వార్థము తగ్గుచుండును.(**Love varies inversely as selfishness**) ప్రేమి తన మిత్రుని సుఖములకై తనసుఖముల వదలుకొనును. చిన్ని విషయములందును, పెద్ద విషయములందును ప్రేమికిని, ప్రియునకును ఇట్టివ్యవహారమే యుండును. సామాన్య సుఖములుగూడ తన ప్రియుఁ డనుభవించుటకు ముందు ప్రేమి తా ననుభవింపఁగోరఁడు. విషమ సంకటములో, ఎడారిలో ప్రాణములు బోనున్నప్పుడు ఒకరిద్దరకు చాలినంత నీరు మాత్రమేయున్నపుడు ముందు ప్రియునకు, తరువాత ప్రేమికిని జీవనరక్షణ మగును. ఈప్రాచీన కథలో పిథియాస్, డేమనుతో నీవుండుము. నేనేచచ్చెదను అనును. డేమను పిథియాస్ తోగూడ అట్లే యనును. వారిరువురు ప్రేములును ఒకరొకరినిచావనీయరు. ఒకరిప్రాణము నొకరు రక్షించుటకొఱకు మరణోన్ముఖులై యుందురు. ఇదియే ప్రేమలక్షణము. ప్రియుఁడు ప్రేమియొక్క హృదయమున ఉండును. ఇంకప్రేమి ఎచ్చట నుండును? నేను క్రింద నుంటిననియు ప్రేమి పైనుండె ననియు అతఁడు భావించును. ప్రపంచమంతయు ప్రేమవ్యాపించినపుడు ఈపృథ్వియంతయు, ప్రేమి హృదయముపైనుండును. అతఁడు క్రిందనుండును. అనఁగా ప్రియులసంఖ్య హెచ్చినకొలఁది ప్రేమి క్రిందకు పోవుచుండును. తన సుఖము, భోగముఆనందము, ప్రాణము వీనిని రక్షించుటకంటె ప్రియుని సుఖభోగాదులను రక్షించుటకు ప్రేమి కోరుచుండును.

బాఖరుగంజు గ్రామమున నేనుచూచిన యొకప్రేమిదృశ్యమును ఇచ్చట నుదహరించెదను. పంద్రెండు, పదమూడు వత్సరములుగల ఒకబాలుడు సుమారు ఇరువదినాలుగు వత్సరములుగల ఒక యువకుని ప్రేమింపుచుండెను. ఒకనాడు ఆయువకుడు బాలకుని ఇంటికి వచ్చి హఠాత్తుగ జ్వరగ్రస్తుడాయెను. ఒకనాడు యువకుడు గదికి వెలుపల వసారాలో ఒడలు తెలియక పడుకొని యుండెను. ఇంతలో ఒకపిల్లియు, సర్పమును పోరాడుచు సర్పము ఆయువకుని దిండు క్రిందకు చేరి పడగవిప్పి ఆడుచుండెను. పాప మాయువకుని జీవితము సంకటాపన్నమయ్యెను. అతడు మృతప్రాయుడై పడియుండెను. పాప మతనిని ఎవ్వరు రక్షించెదరు? దగ్గఱనున్నవారు అచ్చటకు రాజాలకుండిరి. "అయ్యో! ఏమయ్యెను ఏమయ్యెను, అని అందఱు విచారించెడివారేగాని ఒక్కరును ఏమిచేయుటకు సాహసింపరయిరి. ఆబాలకుడు స్నానమునకు వెళ్లియుండెను. స్నానము చేసి వచ్చుటతోడనే అతడీదృశ్యమును చూచెను. వెంటనే ప్రాణములు సరకుగొనక అచ్చటకు ఉరికి తనవస్త్రము సర్పముపై వేసి రెండుచేతులతో దానిపడిగెను పట్టుకొనెను. అందఱు ఆశ్చర్యపడిరి. స్వర్గమున ప్రేమదుందుభి మ్రోగెను. దేవతలు ప్రేమచే ఆబాలునిపై పుష్పవర్షమును గురిసిరి. ఆహా! ఎంత మనోహరదృశ్యము. ప్రేమయన నిట్టిదే. స్పృహవచ్చినపిమ్మట యువకుడు తనప్రియమిత్రుడగు బాలకునిస్థితిచూచి కంపితుడయ్యెను. ఈలోపుగ సర్పము బాలునిచేతినుండి విడిపించుకొనుటకు ప్రయత్నింపసాగెను. బాలకుడు కత్తి నడిగెను. బాలకుని యన్నకూడ దగ్గఱకు రా సాహసింపలేక దూరమునుండియే కత్తి

విసరివేసెను. యువకుఁడా కత్తితో సర్పమును ముక్కలు ముక్క-
లుగ నఱికెను. ఈ బాలకుఁడు నిజముగ ప్రేమయన నేమియో తెలిసికొనెను. తన ప్రియమిత్రునికై అతఁడు ప్రాణము లర్పింపఁ గోరెను. మిత్రుని కష్టదశ చూచి తన ప్రాణములను లక్ష్యము చేయక అతఁడు పాముపడగను పట్టుకొనుటకు సాహసించెను. బాలకా! ధన్యుడవు. నీవు మాకు ప్రేమమహిమను తెలిపితివి. ప్రేమయన నేమియో చూపించితివి. అతని అన్నయందు ప్రేమ లేదు. గనుకనే అతఁడు కత్తి ఇచ్చుటకు సాహసింపఁడాయెను. అతఁడు తుచ్ఛుఁడు కాని తమ్ముఁడు దేవతుల్యుడు. అతఁడు ప్రేమియగుటకు యోగ్యుఁడు. ప్రేమనామమును సార్థకము చేసెను. ఎంత స్వార్థరహితమగు దృశ్యము! నేడు ఏకాంతమున గూర్చుండి విచారింపుఁడు. మీకును హృదయమున ఇట్టి భావములే నింపుటకును, మిమ్ము తనభక్తులుగాఁ జేసికొనుటకును పరమాత్ముని ప్రార్థింపుఁడు.

ప్రేమ ప్రతిఫలమును కోరదు. అట్లు కోరునది మోహము. నిజముగ ప్రేమలో వర్తకసరణి యున్నచో అది వర్తకమేగాని ప్రేమకాదు. నిజమైన ప్రేమి ఎప్పుడును ప్రేమవర్తకము సేయడు. వాఁడు ప్రేమించి సుఖపడును. ప్రేమి హృదయము ప్రియుని ప్రేమమునే వెదకుటకు వ్యాకులమగుచుండును.

స్వర్గలోకము ఈలోకమునకు నిత్యము ఎన్నియో వస్తువుల నిచ్చుచున్నది. కాని ఎన్నఁడేని అది ప్రతిఫలమును గోరుచున్నదా? సూర్యచంద్రులు తమ ప్రేమ కిరణములచే పృథ్విని సంతోషపెట్టి 'పృథ్వీ! మేము నీకీపని చేసితిమి. దానికి కొం

చెము ప్రతిఫలమును నీవును ఇమ్ము, అని యడుగుదురా? ప్రేమి తన ప్రేమదానమును వినియోగించుటకే వ్యాకుల పడుచుండును. ఇచ్చుటయే అతనిపనిగాని, పుచ్చుకొనుట కాదు. నీవు ప్రేమించెదవను ఆశతో అతఁడు నిన్ను ప్రేమించుట లేదు.

ఇదియే ప్రేమధర్మము. యువకులారా! మీ రెవ్వనిని ప్రేమించెదరో వాఁడు మిమ్ము ప్రేమింపవలయుననిమీహృదయ మెన్నఁడేని కోరునా? మీ ప్రేమపాత్రుఁడు మిమ్ము ప్రేమింపని మాత్రమున వానిపై మీ ప్రేమ తొలఁగిపోవునా? అట్లు తొలఁగి పోవుచో వాఁడు నీకు మోహియేకాని ప్రేమికాఁడు. మీరు మోహకూపమందలి మండూకములేగాని, ప్రేమసాగరమందలి మత్స్యములు గారు.

ప్రేమలో గాంభీర్యమేగాని భయంకరత లేదు.
ప్రేమలో కౌతుకమేగాని తరలత్వము లేదు.
ప్రేమలో నావేగమేగాని ఉద్వేగము లేదు.
ప్రేమలోఉచ్ఛ్వాసమేగాని ఉద్వేలత లేదు.
ప్రేమలో శాసనమేగాని పేషణము లేదు.
ప్రేమలో వివాదమేగాని విషాదము లేదు.
ప్రేమలో నభిమానమేగాని అవమానము లేదు.

ప్రేమ సముద్రమువలె అగాథమును, గంభీరమును, అయి యుండును. అర్థరాత్రమున పృథ్వియంతయు శాంతము గను, నిశ్శబ్దముగను ఉండును. ఆకుకూడ అల్లాడక యుండును. బ్రహ్మాండమంతయు ఒక ఓంకారమే ప్రతిధ్వనించుచుండును.

ఆసమయమున ప్రేమి తనశరీరమును, ప్రియుని శరీరమును, మరచి ప్రియుని ఆత్మతో విహరించుచుండును. అప్పుడు బాహ్య ప్రపంచమంతయు క్రమముగ మనస్సునువిడిచిపోవును. పృథ్వియు ఆకాశమును, వాయువును సమీపించుటకు సాహసింపవు. ప్రేమి యగు యోగి తన ప్రియుని అంతరాత్మలో మునిఁగి తన స్వరూపమును పోఁగొట్టుకొనును. మునిగి అతఁడెచ్చటకుఁబోవునో ఎవరు చెప్పఁగలరు. ప్రియునకు దుఃఖముకలుగునని కాఁబోలు దేవతలు శ్వాసము నిరోధించి అనిర్వచనీయమగు ఈఆత్మనిమజ్జనమును వీక్షించెదరు. ఈకఠినకార్యము ఎవనిజీవితమున సాధింపబడునో వానిముఖమున ఒక యపూర్వగంభీరతారూపమగు తేజస్సు ప్రకాశించుచుండును.

## ప్రేమలో గాంభీర్యమేగాని భయంకరత లేదు

ప్రేమలో గాంభీర్యము కలదు. ఆగాంభీర్యములో భయంకరత్వము లేదు. ఆనందమయమగు ఆగాంభీర్యమును జూచుటచే భయము కలుగదు. హృదయము కంపింపను. ప్రశాంతమహాసాగరమును జూచుటచే ఏభావములు కలుగునో ప్రియునిముఖమును జూచుటచేగూడ నిట్టివియే కలుగును ప్రియునిముఖమును జూచుటచే ఎట్టిగాంభీర్యమేని గోచరించుగాక కాని వానితో తనగుప్తవిషయములను చెప్పుటకు ఎట్టి సంకోచమును ఉండదు. ప్రేమియు ప్రియుఁడును ఏకాంతమున గూర్చుండి గంభీరభావముతో జీవితముయొక్క గూఢవిషయములను ఆలోచింపుచు ప్రేమయొక్క ఆదిసృష్టికర్తయగు పరమేశ్వరుని అభయము యాచించెదరు. ఎవ్వనికి నీవు హృదయమం

దలి గుప్తవిషయములను చెప్పుటకు భయపడుదువో వాఁడు నిన్ను ఎప్పుడును ప్రేమింపఁడు. గంభీరములు గుప్తములునగు విషయములే ప్రేమకు ఆహారము.

ప్రేమ గంభీరమయ్యును మిక్కిలి ఆనందదాయకము, సముద్రమును గంభీరమే కాని అందు చిన్నచిన్న సుందరతరంగములెన్ని లేచుచున్నవో చూడుము. భగవంతుఁడు మిక్కిలి ఆనందదాయకుఁడు. పుష్పము వికసించును. సంధ్యాకాలమున ఆకాశము పలురంగులచే భాసిలుచుండును. మలయమారుతము ఎంత మనోహరము వీచుచుండును. ఇవియన్నియు ప్రేమఖేలనములు. ప్రేమచేతనే మనము నవ్వుచున్నాము. ఆనందమున మగ్నులమగుచున్నాము. పరిహాసము చేసికొనుచున్నాము. కాని ప్రేమలో ఆడంబరములేదు. పుష్పదళములు బయటికి నవ్వుచున్నటుల కనుపించును. కాని వానియంతస్థలమున ఒకసుందరమగు నల్లమచ్చ గలదు. అట్లే ప్రేమ పరిహాసముచేయుచు నగుచు దానిఅంతస్థలమున గాంభీర్యము గలదు. ప్రేమానందము ఎండుగడ్డివలెను, దూదివలెను కొద్దిగాలికే ఎగిరిపోవునది కాదు. ప్రేమ ఎల్లప్పుడును గాంభీర్యభారముచే అణగియుండును. ప్రేమ రూపకమగు ఆనందము బాహ్యముగాక అంతస్థమై అగాధగాంభీర్యముచే నిండియుండును. ఆగాంభీర్యమును తెలిసికొనుటయు, దానిని అనుభవించుటయు సులభము గాదు. మహాత్ములు పరమానందమగ్నులై అమృతవర్షమును గురియుచుందురు. శ్రీరామకృష్ణపరమహంసతోగాని, దేవఘుర్ వాస్తవ్యుఁడగు శ్రీరాజనారాయణబాబు (అరవిందఘోషు తండ్రి)తోఁగాని కలసి సంభాషించినవారు ఈప్రేమ గాంభీర్యమును తెలిసికొనఁగలరు.

## ప్రేమలో నావేగమేకాని యుద్వేగము లేదు

నేను ఇంతకుమున్ను ప్రేమలో నావేగమేగాని ఉద్వేగము లేదు అని చెప్పియుంటిని హృదయమందిరమున ప్రేమిని ఆత్మతో కలుపుకొనుటకు ఇచ్ఛయగుచుండును. సర్వదా వానితో కలసియుండుటకు కుతూహలము కలుగుచుండును. ఎంత ప్రేమయుండునో అంత అభిలాషయు నుండును. ప్రేమరాజ్యాధీశ్వరుండగువాఁడు ప్రేమి ఏమికోరిన నది ఇచ్చుచుండును. అతనివద్దనున్న అనంతభాండారమునుండి వజ్రములను, వైడూర్యములును ఏమికోరిన అవి ఇచ్చుచుండును. ఈవిధముగ ప్రేమలో వ్యాకులత్వమునకు అంతముండును. కాని అందు ఉద్వేగ మే మాత్రముండదు. దానిచే ఉన్మాదము హెచ్చుననియు, ధైర్యము నష్టమగుననియు అందురేమో. అట్లుగాదు. ప్రేమ విరహమును బాగుగ సహింపఁగలదు. సతి పతికై వ్యాకులపడును కాని అతఁడు తనయొద్ద లేకుండుటచే అధైర్యము చెందదు. ఆత్మ ఎప్పుడును తనవశములోనే యుండునుగదా ఇంక వ్యాకులమెందుకు? తన ప్రియమిత్రుఁడు అయిదు గంటలకు వచ్చెదనని రాకపోవుటచే వ్యాకులత్వము గలిగి కర్తవ్యముతోఁచకున్నచో అది మోహముగాని ప్రేమకాదు. మీప్రేమ ఇట్టిదియేనా? మీ ప్రియమిత్రుఁడు మిమ్ము వ్యాకులపెట్టునా? మీ కర్తవ్యపాలనశక్తిని నష్టముచేయునా? మీరు మీకార్యముచేయునపుడు మీ ప్రియునిమూర్తి హృదయమునఁ బ్రవేశించి మీ కర్తవ్యపాలనమునకు సాధకమగునా, బాధకమా? బాధకమగుచో జాగ్రత్త. ముత్యాలహారమనుకొని పామును పట్టుకొనవద్దు.

ప్రేమలోనుచ్ఛ్వాసమేగాని ఉద్వేలత లేదు.

చంద్రుని జూచినపుడు సముద్రము ఆనందముచే పొంగిపోవును. కాని అది ఎప్పుడును తనహద్దు మీరదు. ప్రియుని జూచి హృదయమట్లే ఆనందముచే నుప్పొంగును. కాని కర్తవ్యము నెప్పుడు పరిత్యజింపదు. తన ప్రియమిత్రుఁడు చిరకాలమునకు తనయొద్దకు వచ్చినచో హృదయము ఆనందముచే గద్గదమగును. అదిన్యాయమే, కాని దానిచే తన ఆవశ్యక కార్యమునకు భంగము మాత్రము కలుగఁగూడదు. మిత్రుని విడిచి మరియొక ఆవశ్యక కార్యమునకు బోవుటయు మంచిదికాదు. కాని ఆతని మూర్తిని హృదయమున ఉంచుకొని ద్విగుణితోత్సాహముతో కార్యము నెరవేర్చుము. ప్రేమ కర్తవ్యజ్ఞానమును హెచ్చించును. ప్రేమలో నిరంకుశత్వము లేదు. ప్రకృతి ప్రేమమయిగదా. అది ఎన్నఁడేని తన కర్తవ్యమును మీరినటుల జూచితిరా? శ్రీరామ చంద్రుఁడు సీతాదేవిని ఎంత ప్రేమించెడివాఁడు! ఆయన ఒకనాడు సీతను స్పృశించి ఇట్లనెను.

> వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితి వా
> ప్రబోధో నిద్రా వా కిము విషవిసర్పః కిము మదః ।
> తవ స్పర్శే స్పర్శే మమ హి పరిమూఢేంద్రియగణో
> వికారశ్చైతన్యం భ్రమయతి చ సంమీలయతి చ॥

నా ఈ అనుభవము సుఖమా లేక దుఃఖమా? ప్రబోధమా లేక నిద్రయా? నాశరీరమున విషము వ్యాపించినదియా లేక మదమా? నాకేమియు తెలియుటలేదు. నీస్పర్శముచే నా

శరీరమున ఒకవికారము కలిగి నాయింద్రియములను ముగ్ధములు గను, నాజ్ఞానమును శూన్యముగను చేయుచున్నది. ఏమి నే నిట్లయితిని, ఇట్టి శ్రీరామచంద్రుడు తనకర్తవ్యపాలనముకై సీతను అరణ్యములకు పంపెను. బుద్ధదేవుడు తన కర్తవ్యజ్ఞానవశీభూతుడై తనప్రియపత్నియగు గోపనుగూడ పరిత్యజించెను. శ్రీచైతన్యస్వామి ప్రేమ ప్రచారమునకై తనతల్లియగు శ్రీశచీదేవిని, తనభార్యయగు విష్ణుప్రియను పరిత్యజించి సన్యాసమును స్వీకరించెను. ఆయన దక్షిణదేశమునకు వెళ్లినపుడు తనప్రాణప్రియులగు శిష్యులు భూమిపై స్మారకములేక పడిపోయిరి. ఆయన కన్నెత్తియైనను వారివంక చూడలేదు.

శ్లో॥ వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి
లోకోత్తరాణాం చేతాంసి కోహి విజ్ఞాతు మీశ్వరః॥

ప్రేమియొక్క హృదయము వజ్రముకంటె కఠినమును, కుసుమముకంటె కోమలమును అగుచున్నది. దానిని తెలిసికొనుటకు ఎవ్వరు సమర్థులు? నిరంకుశతారహితమగు ఈప్రేమ చిత్రమును మీహృదయ పటమందు చిత్రించుకొనుడు.

ఈశ్వరుడు మనలను ప్రేమించునుకాని అన్యాయము చేయునపుడు మనము శిక్ష ననుభవింపక తప్పదు. అయితే ఆశిక్షలో క్రోధము లేదు మూలమున ప్రసన్నతయైయుండును. తండ్రి తప్పు చేసినప్పుడు తనపుత్రుని దండించును. కాని వానిశిక్షణమందు ఎంతప్రేమ ఇమిడియున్నదో చూడుడు. ప్రియునిదోషములు వారించుటకై వానిపై అవశ్యము శాసనము చేయవలయును.

కాని అందు అన్యాయముగాని, హింసగాని యుండదు. ప్రేమ శాసనములో భయంకరత్వము లేదు. దోషములు తొలగించుటకై ఒకడు ఒకనిని కొట్టుచుండును. కాని మరల ఒకక్షణమునకే వానిని దగ్గరకు దీసికొని లాలించును. ఏకకాలముననే శాసనమును చుంబనమును ఉండుటయు అసంభవముగాదు. ఒకసమయమున ఒకప్రేమి తన మిత్రుని ఒకదోషమునకై దండింపవలసివచ్చెను. దానిచే వారిరువురును పొట్లాడుకొని చీలిపోయిరి. దైవవశమున కొంతకాలమునకు వారిరువురును ఒకచెట్టుక్రింద తారసిల్లిరి. కాని ఒకరినొకరు స్పృశించుటగాని, మాట్లాడించుకొనుటగాని లేకుండెను. అందులోనొకడు రెండవవాడు భోజనము చేసినదియు, లేనిదియు తెలిసికొనగోరెను. కొంచెము సేపు విచారించి వాడు చెట్టువంకచూచి ఇట్లనెను. "ఓవృక్షమా! నే నెవ్వనితోను మాట్లాడను. నిన్నే అడుగుచున్నాను. చెప్పుము. నీవు భోజనముచేసితివా" రెండవబాలుడును చెట్టువంకజూచి ఇట్లనెను. ఓవృక్షమా! నేనును ఎవరితోడను మాట్లాడను. నీకే చెప్పుచున్నాను. నేను భోజనముచేసితిని. ఎంత మనోహరదృశ్యము! శాసకుడగు బాలకుడు శాసనము చేసెను. గాని పేషణము (అణచుట) చేయుటకు వానికి అధికారము లేదు. ప్రేమ వాని కఠోరశక్తిని హరించెను.

ప్రేమలో నభిమానమేగాని అవమానము లేదు.

శ్రీకాళీభక్తిలో మగ్నుడై రామప్రసాదు ఇట్లు అభిమానముతో పాడుచుండెడివాడు—"అమ్మా అమ్మా యని నిన్ను ఇంకపిలువను." కాని తల్లి తనయొద్దకు రాకుండుటచే రామప్ర

సాదు తన కవమానమని యెంచెనా? అట్లు అగుచో ఇట్టిమధుర గర్వముతో ఆతఁడు పై పదమును పాడియుండఁడు. అవమాన మనుకొనుచోట, అభిమానములో మాధుర్య ముండదు. ఒక్కొక్కప్పుడు ప్రేమి అభిమానముచే పొంగిపోవును. కాని ప్రియుని ఆలింగనముచేయక ఎంతవరకు ఉండఁగలడు? అవమానమను కొనునపుడు ఆలింగన మసంభవము. శ్రీచైతన్యస్వామి అభిమాన ముతో నే నింక శ్రీకృష్ణునిపేరె త్తనని ప్రతిజ్ఞచేసెను. కాని ఆ ప్రతిజ్ఞ దృఢముగ నుండకపోయెను. ప్రేమి ఒకసమయమున నే నింక వానిని స్మరింపను అని చెప్పును. కాని ఉత్తరక్షణ మున నే

శ్లో॥ ఆశ్లిష్యవా పాదరతాం పినష్టు మా
మదర్శనా న్మర్మహాతాం కరోతు వా ।
యథాతథావా విథథాతు లంపటో
మ త్ప్రాణనాథస్తు సఏవ నాపరః॥

"అతడు నన్ను కౌగిలించుకొనుఁగాక లేక నావంక చూడక నన్ను పీడించుఁగాక. ఏమైనను ఆలంపటుఁడే నాకు ప్రాణేశ్వరుడు" అనును. ప్రేమాభిమానము ఈవిధముగ అస్థిర మగుచున్నది.

ప్రేమలో వివాదమేగాని విషాదము లేదు.

వెనుకచెప్పినవిషయములనుబట్టి ఇది తెలిసికొనుట కష్ట ముగాదు. బాహ్యవిషయములను బట్టి మనోభేద ముండినను ండు గాక. దీనిచే ఆదర మేమాత్రమును తెరుగదు. ప్రేమకు మూల

ము భగవంతుఁడేయగుచో, మనయెల్లఱకు ఆయనచరణము శ్రేపకాశ్రయమగుచో సాధారణవిషయములఁ గూర్చిన వివాదములో విషాద మెందుకుండును? హిందువులు, ముసల్మానులు, చీనావాసులు ఎల్లఱును పరస్పర గంభీరప్రేమ బంధనముచే బద్ధులు గావచ్చును. ఈ బంధనము స్వాభావికమైనది. ఆరంభమున దేని యాధారముచే ప్రేమ ఉత్పన్నమగునో అది విగత వివాదం అనఁగా విషాద జనకమగు వివాదములేనిది. రామకృష్ణ పరమహంసయు, కేశవ చంద్ర సేనును పరస్పరము వివాదము సేయుచుండెడివారు. కాని అందు విషాదము లేదు.

ప్రేమలక్షణము లెన్నియో చెప్పఁబడినవి. ఇట్టి లక్షణములు గల ప్రేమను సాధించుట చాల మనోహరముగ నుండును. భగవంతుఁ డింతసుందరుఁడుగ నుండుటకు కారణము ఆయన ప్రేమ నిధియగుటయే. మీరును ప్రేమభరితులగుచో సుందరులయ్యెదరు. సుందరులగుఁడు. సుందరులగుఁడు. ఆసుందరసముద్రమున మునిఁగి సుందరులగుఁడు. ప్రేమనిధియగు పరమాత్మునుండి ప్రేమను సంగ్రహింపుఁడు. ఇట్టి నిదర్శనముచే జీవితము ధన్యమగును. మీరు ఆపాద మస్తకము ప్రేమలో మునిఁగిపొండు. మనోవాక్కర్మములచే ప్రేమ మహిమను ప్రచారము సేయుఁడు. ఇదియే నేను భగవంతుని ప్రార్థించుచున్నాను.

## ప్రేమ శక్తి—ప్రేమ సాధన



మూఢమతులగు యువకులు మోహామునకు ప్రేమస్థానము

నిచ్చుచున్నారు. వీరు మణిహారమనుకొని సర్పమును మెడలో ధరించుచున్నారు. అమృతమనుకొని విషమును త్రాగుచున్నారు. సముద్రమనుకొని మరుస్థలమునకు పరుగెత్తుచున్నారు. ఈ యువకులను జాగరూకులఁజేయుటకై వెనుకటి పరిచ్ఛేదము లందు కొన్ని ప్రేమలక్షణములు చెప్పఁబడినవి. ఈపరిచ్ఛేదము నందు నేను ప్రేమశక్తినిగూర్చియు, తత్సాధనను గూర్చియు నా యభిప్రాయమును వెల్లడించెదను.

ప్రేమ సర్వశక్తిమంతమును, సర్వవిజయియు నైయున్నది. బ్రహ్మాండములో దేనివలనను కాఁజాలనిది ప్రేమచే నగును. సర్వశక్తులును నిరర్థకములగుచోట ప్రేమ విజయమును గాంచుచున్నది. ప్రపంచ చరిత్రమును జూడుడు. జగాయి మధాయి అనువారు ఏశక్తికిని పరాభూతులు కాలేదు. తుదకు నితాయియొక్క ప్రేమకు లొంగిరి. భాగీరథిని ఐరావతమువలె వారు నితాయి ప్రేమచే తరించిరి. ఉపాధ్యాయుఁడు దుష్టబాలకుని శిక్షించుటకు ఎన్నియేని ఉపాయములు అవలంబించును. కాని ఒకటియు సఫలము కాదు. తుదకు ఉపాధ్యాయుఁడు బాలకుని ప్రేమమూలమున శిక్షించుచో వాఁడు వెంటనే స్వాధీనమగును. ఒకఁడు భయంకరవ్యాధిచే పీడితుండై యుండెను. వైద్యుఁడు ఎన్నిమందు లిచ్చినను రోగము కుదురలేదు. కాని అతనిమిత్రుఁ డొకఁడు రాఁగానే అతనిశరీరమున ఒకఅద్భుతశక్తి వచ్చెను. వెంటనే యతఁడు మంచమునుండి లేచి కూర్చుండెను. ప్రేమ దుర్బలుని బలవంతుని జేయుచున్నది. దురాచారుని సదాచారుని జేయుచున్నది. మహాపాపుని పుణ్యాత్ముని

జేయుచున్నది. ఇంక నేమి కావలయును? మీా జీవితము వైపు నకుచూడుడు. ఎంత ప్రేమయో అంత జయజయకారము. ప్రేమ అన్నిరోగములకు ఒకటే మందు. స్వర్గలోకము, మృత్యులోకము సురలోకము, నరలోకము ప్రేమ సూత్రమున గ్రుచ్చబడియున్న వి. ప్రేమకన్న మించిన శక్తిమంతమగు వస్తువు ప్రపంచమున నెచటను లేదు. రామప్రసాదుయొక్క ప్రేమ గానముచే సిరాజ ద్దౌలాయొక్క పాషాణహృదయము కరగిపోయెను. నెపోలియన్ బోనపార్టు చేయజాలనిది ఏసుక్రీస్తు సులభముగ చేయ గలిగె ను. నెపోలియను సెంటు హెలీనాలో ఒకని నుద్దేశించి విలపిం చెను. నెపోలియన్ యొక్క అనుచరులను వశీకరించిన శక్తియు ప్రేమ శక్తియే. అతని ప్రేమచే అనుచరులెల్లరు మంత్రముగ్ధ మగు సర్పమువలె వశులగుచుండెడివారు. అర్కోలా యుద్ధము లో విజయము గాంచుటకు ముఖ్యహేతువు ప్రేమ వికాసమే. అస్టారలిటజు యుద్ధములో ప్రేమవలననే నెపోలియనుకు ప్రాణ రక్షణము కలిగెను. భయంకరమగు ఒక తుపాకిగుండు నెపోలి యను వైపునకు వచ్చుచుండెను. అతని బాల్యమిత్రుడగు జై కోపోరు ఆగుండుకు ఎదురుగ తనఱొమ్ము సాచెను. ఇట్టి ప్రబల శక్తిచే ప్రేమ ప్రపంచములో సర్వోన్నతముగ గణింపబడు చున్నది. ప్రపంచములో సర్వత్ర ప్రేమయే విజయము గాంచు చున్నది. ప్రేమ మహిమనుగూర్చి యెన్నియేని ఉదాహరణము లీయవచ్చును.

ప్రేమ సాధననుగూర్చి కొన్ని ఉపాయములు చెప్పుటకు ప్రయత్నించెదను.

(౧) ప్రేమసాధనకు మొదటి కర్తవ్యము—ప్రేమస్వరూపుని ప్రేమకీర్తనమును, ప్రేమికులతో ప్రేమవిషయకమగు చర్చయు, ప్రేమికుని జీవిత చరిత్రపఠనమును, భగవంతుని ప్రేమ సంకీర్తనమును, రామకృష్ణపరమహంస, భాస్కరానందస్వామి, మహాత్మాగాంధి మున్నగు ప్రేమవీరుల సహవాసమును అయియున్నది. ఇట్టిప్రేమ చర్చవలనను, బుద్ధదేవుడు, చైతన్యస్వామి మున్నగు ప్రేమమయుల జీవిత చరిత్ర పఠనమువలనను, ప్రేమ రహితులగువారి హృదయమున ప్రేమావిర్భావ మగును. ప్రేమాంకురముమాత్రము గలవారి హృదయమున ప్రేమాభివృద్ధి యగును. ప్రేమస్వరూపుని ప్రేమలీలలు వినుటవలనను, కీర్తించుటవలనను, ప్రేమ ప్రసంగము చేయుటవలనను పాషాణ హృదయునికిఁగూడ ప్రేమ యుత్పన్న మగుచున్నది. వాని హృదయముఁగూడ అమృత పూరిత మగుచున్నది. వాఁడు దానిని గ్రోలుచు ప్రేమ యెక్కడ ప్రేమ యెక్కడ అనుచు నున్మత్తుఁడగుచున్నాఁడు. పరమపిత యగు పరమాత్మయును భక్తులవాణిని విని ఎప్పుడో అప్పుడు తప్పక ప్రసన్నుఁడగుచున్నాడు. జగాయి హృదయమునఁగూడ నిత్యాయిమూలమున కొలఁది నిమిషముల లోనే ప్రేమభిత్తి స్థాపితమయ్యెను.

(౨) ప్రకృతి దర్శనమును జగన్మయమగు ప్రేమవిధి యొక్క వికాస మార్గమును ఇంచుక ఆలోచించినఁ దెలియగలదు. ప్రేమభిత్తిమీఁదనే మానవసమాజ మాధారమైయున్నది. ప్రపంచ మాన్నత్యదశ నందినకొలఁది ప్రేమమహిమ విస్తృతమగుచుండును. అమెరికాయందలి శికాగో పట్టణమున ఒక ప్రేమమహోత్సవము జరుగును. అచ్చట ఈ ప్రపంచమందలి

భిన్నభిన్నజాతులవారు అన్యోన్యాలింగనముచే ప్రేమస్వరూపము యొక్క లీలలు చూపించుచున్నారు. (Parliament of religions) వివిధ మతముల సభ, ఏమి నేర్పుచున్నది? భిన్నభిన్న మతమతాంతరములఁ గూర్చి ఎన్నియేని వాదవివాదము లగుగాక కాని ధార్మిక కేంద్రము ప్రేమపరిపూరితమే యగుచున్నది. దేశదేశాంతరములజరుగు వాణిజ్యవ్యాపారమునవలనఁ గూడ పరస్పరప్రేమ ప్రచారము జరుగుచున్నది. నాకొరతలు నీవల్లను, నీకొఱతలు నావల్లను దీఱుచున్నవి. రాజనైతికకార్యములందును కొంచెము ధ్యానముతోఁజూచిన ప్రేమఖేలనమే కనుపట్టుచున్నది. భారతవర్షము ఇంగ్లండునుండియు, ఇంగ్లండు భారతవర్షము నుండియు చాల సహాయముఁ బొందుచున్నది. ప్రపంచమంతయు ప్రేమసూత్రమున కట్టబడి యున్నది. విచార పూర్వముగ చూడుఁడు. ప్రతి ఆధ్యాత్మికతత్త్వ ప్రకాశమందును యెన్నియో ప్రేమలీలలు గోచరించును. వానినివర్ణించుటకు నాశక్తి చాలదు.

ప్రకృతిదర్శనముఁగూడ చాల ప్రేమోద్దీపక మగుచున్నది. చంద్రుఁడు, సూర్యుడు, జలము, వాయువు, వృక్షములు, లతలు మున్నగునవి, ప్రేమస్వరూపుని యాదేశమును బాలించుచు మనకెంత యానందము గలిగించుచున్నవో చూడుఁడు. ఇది తలఁచుకొనినతోడనే హృదయమున ప్రేమసంచార మగుచున్నది. ప్రేమభిక్షుడగు చంద్రునిఁ జూడుడు. హృదయము ప్రేమరసముచే నిండిపోవుచున్నది. సుందరములగు ప్రాకృతిక దృశ్యములను ప్రత్యక్షమునఁగాని చిత్రమునగాని చూడుఁడు నదియొక్క కలకలస్వనము వినుఁడు. మలయమారుతమును సేవింపుడు. పుష్పములెట్లు వికసించునో చూడుఁడు.

వర్షాదృశ్యమును తిలకింపుడు—మీహృదయము ప్రేమచే నిండి పోవును. మనోహరమగు ప్రకృతిశోభను చూచిన హృదయమున ప్రేమప్రవాహము వెల్లివిరియును. దీనివలనను మీ రిదివఱ కెవ్వరిని ప్రేమింపకున్నను మీహృదయమున ప్రేమ యుత్పన్నమగును.

ప్రేమరూపిణియగు ప్రకృతిని సమీపించినపుడు హృదయ కలశము ప్రేమచే నిండుచున్నది. గాన నలుప్రక్కలనున్న సుందర దృశ్యములను జూచిమనస్సును సంతుష్టపఱచుకొనుడు. నీమిత్రు డెవ్వఁడేని యున్నచో అతనితోఁగలసి ప్రాకృతిసౌందర్యమును జూచుచుండుము. అప్పుడు ప్రతివస్తువును రెట్టింపు సుందరముగఁ గనుపట్టును. మీ ప్రేమ అభివృద్ధిచెందును. నీవు నాప్రియమిత్రునితోఁ గలసి యెంత ప్రకృతి చూచెదవో, మీయిరువుర ఆనందమును అంత యినుమడించును. ప్రేమ వృద్ధియైనకొలఁది సూర్యునినుండి తేజమును, చంద్రునినుండి మాధుర్యమును, పుష్పమునుండి కోమలత్వమును, సముద్రమునుండి గాంభీర్యమును మీరు సంగ్రహింపఁగలరు. మఱియు ప్రకృతియందలి నియమ శృంఖలను, శాసనమును, చూచి మీరు మీ జీవితమున దానిని గ్రహించి దివ్యధామమునకు అధికారులగుఁడు.

(3) నీవు నీమిత్రునితోఁ గలసి కర్తవ్యసాధనమునకు ముందంజ వేయుము. మీరుభయులును కర్తవ్యసాధనమున కెంత కృషి చేయుదురో అది యంత మధురముగ నుండును. ఏ ప్రేమచే కర్తవ్యజ్ఞానము నష్టమగునో అది ప్రేమ గాదనియు, మోహమనియు, వెనుకనే చెప్పితిని. ప్రియుని జూచినప్పుడు హృదయ

మున ఏకాగ్రత ఉత్పన్నమగును. కర్తవ్యసాధనమున మనస్సు బాగుగ లగ్నమగును. చిత్తైకాగ్రత సాధించు విషయమై పతంజలి "యథాభిమతధ్యానాద్వా" ప్రియవస్తువును ధ్యానించుట వలనను చిత్తము ఏకాగ్రమగును. అని చెప్పెను. చంద్రుని చూచినచో చిత్తమున కేకాగ్రత గలుగును. ఎవని ప్రేమించెదవో వానిని చూడగాచూడగా హృదయమందలి వైషమ్యము తొలఁగిపోవును. ఏప్రేమచేప్రియునిచూచుటవలనఇంద్రియములు చంచలములగునో చిత్తమున వైషమ్యము జనించునో అదిప్రేమ గాదు. అది సర్వనాశద్వారమగు కామము లేక మోహము. ఇట్టిప్రేమను నీవద్దకు రానీయకుము. ప్రేమియు ప్రియుఁడును గలసి కర్తవ్యపాలనమునకు ప్రయత్నింపుఁడు. కర్తవ్యము బాగుగ నెరవేరును. పరస్పర సందర్శనమువలనను, స్మృతిసుఖము వలనను ఇరువురకు కర్తవ్యసాధనమున విశేషసౌకర్యము లభించును. ఈవిషయము హృదయమున నున్నచో మీపారస్పరికప్రేమ మఱియు దృఢపడును. మనకర్తవ్యములకు తోడుపడువాఁడే మనకు నిజమైన మిత్రుఁడు. కర్తవ్యపాలనముచేయువారినిగూడ చూచినచో ప్రేమింపక యుండఁజాలము. గాన ఒకరికర్తవ్య సాధనమునకొకరు తోడ్పడుచును, ఒకరికర్తవ్యనిష్ఠను ఒకరు చూచుకొనుచును పరస్పరము ప్రేమించుకొనుచున్నారు.

(౮) పరస్పరజీవితముల పరీక్షించుటచే ప్రేమ వృద్ధియగును. ఆత్మపరీక్షచే తనహృదయము నిర్మలమగునటుల ప్రియుని జీవితపరీక్షవలనగూడ వానిని నిర్మలుని చేయవచ్చును. ప్రథమమున నీహృదయమును, నీప్రియుని హృదయమును ప్రేమయను ఒరపిడిరాయిపై పరీక్షించుము. పైనజెప్పిన ప్రేమలక్షణముల

న్నియు సరిపోల్చిచూడుము అవి సరిగా నున్నచో బంగారము కలితీ లేనిదని తెలిసికొనుము. సరిగనుండనిచో ఇట్టి ప్రేమనుండిదగా రేముగనుండును. ప్రేమ అమృతమే. కాని అమృతమును విషము లోగలియుటచే ప్రాణఘాతక మగుచున్నది.

జలము లేక బ్రతుకుట కష్టము. కాని ఆజలమే విషమిశ్రితమగుచో కలరా కలిగించుచున్నది. విషమిశ్రితమగు ప్రేమ సైతానుయొక్క ప్రధానస్థలము. ప్రపంచేతిహాసములో విషమిశ్రితమగు ప్రేమచే రాక్షసులు వేలకొలది జీవులను సంహరించినటులును. ప్రతిస్థానమునను వారు నివసించియున్నటులును చూడగలరు. జాగ్రత్త. ఏదిక్కు అట్టిప్రేమ గనుపడునో అటు అడుగుకూడ పెట్టవలదు. పరస్పర ప్రేమను పరీక్షించి జీవితమును పరీక్షింపుడు. ప్రేమియందు ఏయేగుణ దోషములున్నవో వేఱు వేఱుగ పరిశీలించి చూడుడు. ప్రేమధర్మమును, ప్రేమను ఇట్లు పరిశీలించుట చాల చమత్కారముగ నుండును. ప్రియుఁడు ప్రేమివద్ద తనహృదయమును బహిరంగపరచక యుండఁజాలడు. ప్రేమ ఉన్నచోట హృదయము స్వయముగనే ప్రకటమగును. అట్లుహృదయము ప్రకటముగాక యున్నచో అచ్చట ప్రేమ లేదు. ప్రేమితన ప్రియునివద్ద తనసమస్తరహస్యములను అవి మంచివి యగుగాక చెడ్డవి యగుగాక స్పష్టముగ విప్పిచెప్పును. ఇందు కలుగు ఆనందము ప్రపంచమున మఱియెచ్చటను గలుగదు. జనులు సూర్యుఁడుదయింపగనే పద్మము వికసించునని చెప్పుదురు. కాని నానమ్మకమేమన పద్మము తనహృదయమును విప్పి తన ప్రియుఁడగు సూర్యునికి చూపించును. సూర్యకిరణములచే తనయంతస్థలము ఆనందితమగుచు తనహృదయకలికను విప్పుచున్నది.

కుముదిని చంద్రునిచూచి వికసించుచున్నది. అనగా తన హృదయమును అతనిముందు విప్పి అతనిధవళచంద్రికను తనయందు లీనముచేసికొన్నది ఈవిధముగ హృదయమును విప్పి ప్రేమించువారి ప్రేమకిరణములచే చిత్తమును ప్రసన్నము చేసికొనుకోర్కె యెల్లఱకునుండదు.

ఈవిధముగ పరస్పరము హృదయములు విప్పి మాట్లాడుటచే రహస్యములు బయటపడును. వారికి తమజీవితమును పరీక్షించు నవకాశము లభించుచున్నది. ఇట్టి యవకాశమును ఉపయోగించుకొని వారు తమగుణదోషములను పరిశీలింపఁగలుగుచున్నారు. ప్రియజీవితమును విశ్లేషణము (Analysis) చేయుము. అది యెట్లు ఏర్పడినదియు, అందేగుణదోషములున్నదియు సూక్ష్మదృష్టితోఁ జూడుము. దానిని చూచి నీయొక్కయు, నీప్రేమియొక్కయు జీవితమును సంఘటనము చేయుము. ఇట్టి పరీక్షచే జ్ఞానోన్నతి యగును. విజ్ఞానముచే మననము చేయుకొలఁది వ్యష్టిసమష్టివిషయము గోచరమగును.

అధ్యాత్మ విజ్ఞానము, మనోవిజ్ఞానము, ప్రాకృతిక విజ్ఞానము ఇవియన్నియు వ్యష్టిసమష్టి రూపములు. కేవలము (Analysis) ను (synthesis) ను అయియున్నవి. వీనిచే జ్ఞానము వృద్ధియగును. బుద్ధి కుశాగ్రమగును. ప్రేమి యేవస్తువును ప్రేమించునో దాని వ్యష్టిసమష్టివిషయముల వ్యాకులుఁడై యుండును. ఇమార్సన్ కవి చెప్పుచున్నాడు. Love sharpens intellect) (ప్రేమ బుద్ధిని తీక్ష్ణముచేయును.) ఎవనిని ప్రేమించెదవో వాని చరిత్రను సూక్ష్మదృష్టితో పరిశీలింపుము. కొం

దఱు ప్రేమ గుడ్డిదియందురు. కాని ప్రేమ గుడ్డిది కాదు. కామము గుడ్డిది. ప్రేమదృష్టి తీవ్రమైనది. God is love (పరమేశ్వరుడు ప్రేమస్వరూపుడు) ఈశ్వరుఁడు విశ్వచక్షువు. ప్రేమయందును ఆయనచూపు ఉన్నది. గాన ప్రేమి తన దివ్య దృష్టిచే ప్రియుని ఆంతరిక భావముల నెఱుగుఁను. అందు ప్రేమ తగుటకు కారణము లేదు. ప్రియునియందు దోషము కనుపట్టు నపుడు దానిని తొలగించువరకు ప్రేమి వ్యాకులుడుగ నుండును. దానిచే ప్రేమ వృద్ధియగును. ప్రియుని హృదయమున చేర్చుకొని ప్రేమి చెప్పును. మిత్రమా! నీలోపల ఈ కళంకమును చూడఁ జాలఁను దీనినితొలఁగించుము. ఈ ప్రేమియొక్క వాక్యము ప్రియు నకు వేదవాక్యము. ప్రియుఁడు వెంటనే ఆవాక్యమును పనిలోఁ బెట్టుటకు ప్రయత్నించును. ప్రేమి తనమాట నెరవేరుటజూచి తానుకూడ సాయపడుచు ప్రేమస్వరూపమగు ఆశీర్వాదమొసఁ గును. కళంకము శీఘ్రమే తొలగిపోవును. మనమిత్రులహృదయ మును నిర్మలముగఁ జేయుటకై మనము వారి కళంకములను తొ లఁగించుకొనవలెను.

ఇట్టి యాలోచన మనుష్యుని పవిత్రునిఁ జేయుచున్నది. మరియు దీనిచే ప్రేమగూడ వృద్ధిఁ జెందును. మనము మనయంత రాత్మయందు దాఁగియున్న పాపమును స్వయముగ తొలఁగించు కొనఁజాలమియు, ప్రియుని సహాయముచే అది తొలఁగిపోవుట యు, మనము తరుచు గాంచుచుందుము. మన శరీరమందలి పెక్కు అవయవములను మనము చూడఁజాలము. అట్లే మన దోషములనుగూడ మనము చూడజాలము. కాని ప్రేమి

అన్నియుచూడఁగలడు. గాన అతఁడు మనకంటెను చాల సమీపస్థుఁడు. అట్టివానిని మనము హృదయపూర్వకముగ ప్రేమింపనిచో ఇంక నెవ్వని ప్రేమించెదము?

(౫) ఏకాంతమునఁ గూర్చుండి ప్రేమికుని ధ్యానించుట చాల లాభకారి యగును. వానిముఖము, చేతులు, కాళ్లు, మున్నగు అవయవములను వాని శరీరమును ధ్యానింపవలదని నేనందును. కానివాని శమము, దమము, దక్షత, విచారశక్తి, దయ, ఆధ్యాత్మికశక్తి మున్నగు గుణములే ముఖ్యముగ ధ్యానింపఁదగినవి. ఇట్టి ధ్యానముచేతనే ప్రేమ వృద్ధియగును. శారీరిక ధ్యానమును విడిచి ఆత్మధ్యానమును జేయునపుడు విడిగా నుండుటయు నావశ్యకమగును. పరమాత్మ నన్వేషించునపుడు బాహ్యసంబంధ ముంచుకొనుట కొంత యావశ్యకమగును ఎమర్సన్‌కవి చెప్పునది చూడుఁడు Leave this touc clawing.(స్పర్శ్యా[illegible] విడువుము. పరమాత్మపై ధ్యానముంచుము.) ఏసుక్రీస్తుకై యెందఱో తమ ప్రాణములర్పించిరి. కాని వారు ఆయన మూర్తిని ప్రేమించెడివారుకారు. కేవలము ఆత్మనే ప్రేమించెడివారు ప్రసిద్ధ లేఖకుఁడగు వాషింగ్టన్ ఆర్వింగు ఒకచో వ్రాసెను— ఒక స్త్రీ బాయరన్‌కవిని ఎన్నఁడును చూడలేదఁట. అయినను ఆమె అతనికై తన ప్రాణములర్పించుటకు సిద్ధపడెనట.

(౬) కొన్నివిషయములను జెప్పి యింక నీగ్రంథమును ముగించెదను. భగవదుపాసన చేయునపుడు మీరు మీప్రేమిని హృ

దయమున నుంచుకొనుఁడు. అతఁడు మీసమీపమున లేనిచో అతనిమూర్తిని, అతనియాత్మను భగవంతుని చరణకమలములం దర్పింపుఁడు ఇంకనెంత యానందము కలుగునో చూడుడు. ఎవరిని ప్రేమించెదరో వారియాత్మలను మాలగా గుచ్చి పరమేశుని పాదములపై కానుకగా సమర్పింపుఁడు. ఇందు అమృతము లభించును. మీ ప్రేమవిషయమై యేమి చెప్పఁదలచితిరో అది పరమేశుని పాదసన్నిధిని విన్నవింపుఁడు. ఇట్లు చేయుటచే పరమాత్మ మీయుభయులకు కళ్యాణము సేయును. ఏనాడు ప్రపంచమంతయు నాత్మరూపముగఁ గాంచి పరమాత్మునిపాదకమలములపై ప్రేమాంజలిని సమర్పించెదరో ఆనాడు మీరు ప్రేమస్వరూపునికి తగిన సంతానమని చెప్పికొనుట కర్హులగుచున్నారు. దేవతలుమిమ్ము ప్రేమసింహాసనముగఁ గూర్చుండబెట్టి హారతి ఇచ్చెదరు. నలుదిక్కులు ప్రేమపూర్ణము లగును. ఆనాడు మీకీమృత్యులోకము నిజముగ స్వర్గలోకమగును.

భారతవర్షము నున్నతదశకు తేఁబోవు నోయువకులారా! కామమోహములచే దేశమంతయు నాశమయినది. ఇదిగాంచియే మీయెదుట నున్నతమగు ప్రేమాదర్శమునుంచుచున్నాను. మీ రీయాదర్శము నెదుటనుంచుకొని ప్రేమసాధన చేయుఁడు. ఈశ్వరుఁడు మీకు మేలుసేయును. దేశము రక్షింపబడును. మీపెద్దలయానందమునకు మేరయుండదు. స్వర్గమునుండి పుష్పవర్షము గురియును. మంచిదినములు వచ్చును. విశ్వము శాంతిసౌఖ్యములచే పరిపూర్ణమగును.

పరమాత్మ మీహృదయమున శక్తి నిచ్చుగాక. మిమ్ము నాశీర్వదించుఁగాక. మీరు మనుష్యతఁబడయుడు. మీమూలమున ప్రపంచమునకు కల్యాణమగుగాక.

ఓంశాంతిః.

## —* ఆంధ్ర గ్రంథ రత్నాకరము, గుడివాడ *—

ఆంధ్రసారస్వతమున కత్యావశ్యకములును అపూర్వములునగు గ్రంథరత్నములఁ బ్రకటించి యథాశక్తి ఆంధ్రవాఙ్మయమునందలి కొఱంతదీర్చుటయే ఈగ్రంథమాలయొక్క ప్రధానోద్దేశము. సం॥ 1కి మూఁడు నాల్గు గ్రంథరత్నములు వెలువడును. 8 అణాలు ప్రవేశపు రుసుము ఇచ్చి చందాదార్లుగ చేరువారికి ఇదివఱ వ్రాసిన గ్రంథములలో మాచే ప్రకటింపఁబడిన గ్రంథములన్నియు రుప్ 1కి 4 అణాలు చొ॥ తగ్గించి ఈయఁబడును. వర్తకులకు మంచి కమీషను ఈయఁబడును. ఇదివఱ గ్రంథములలో మొదటి యాలు నాటకరచనా సార్వభౌముఁడని విదేశీయులచేఁ గూడ పొగడఁబడిన శ్రీద్విజేంద్రలాలు రాయల బంగాలీ గ్రంథములకు చక్కని తెలుఁగు అనువాదము. ఆంధ్రసారస్వతములో కాలోచితములగు అత్యుత్తమ నాటకములేమేని యున్నచో నవి ద్విజేంద్రుని గ్రంథముల కనువాదములే యని పెక్కురసికుల నిష్కపటాభిప్రాయము.

## —* దు ర్గా దా సు *—

రసపుత్రవీరుఁడగు రాథోరు దుర్గాదాసుని దివ్యచరిత్రము కనుమనోహరముగ చిత్రింపఁబడినది. చక్కనిప్లాటు. దేశభక్తి, హిందూమహమ్మదీయమైత్రి, రాజభక్తి ఇందు కనునిపుణముగ చూపఁబడినవి. సినిమాలో ప్రదర్శింపఁబడి ఆంధ్రుల హృదయముల కొల్లగొనిన నాటకరాజమిదియే. వెల రు 1-4-0

## —* కాళిదాస భవభూతులు *—

నాటకమన నేమియో తెలిసికొనఁగోరినచో ఈవిమర్శనము తప్పక చదువుఁడు. వెల రు 1—0—0

—* మేవాడుపతనము *—

పతిభక్తి, దేశభక్తి, విశ్వప్రేమ మున్నగు మహోన్నత భావములను ప్రత్యక్షముగ దర్శించి పృధ్విపైనుండియే స్వర్గ సౌందర్యమును చూడఁగోరినచో దీనినిచదువుఁడు. వెల 1-4-0

—* చంద్రగుప్త *—

మౌర్యసామ్రాజ్యస్థాపకుఁడగు చంద్రగుప్తుని చరిత్ర ఇంత మనోజ్ఞముగ నిదివఱకెవ్వరును రచింపలేదు. విశ్వవిఖ్యాతిని గడంచిన ‹ముద్రారాక్షస›ముండగా ఇట్టి యపూర్వనాటకము రచించి యసమానప్రజ్ఞను తెలియఁజేసిన ద్విజేంద్రుఁడు సర్వధా వంద్యుఁడు. ఇందు అమృతగుళికలఁబోలు చక్కని పద్యములును గీతికలును గలవు. వెల రు 1—0—0

—* రాణాప్రతాపసింహ *—

మొగలులయుచ్ఛిష్టము నాసింపక మాతృదేశమునకై కఠోర దారిద్ర్యవ్రతము నవలంబించి మరణాంతమువఱకు తన ప్రతిజ్ఞను పాలించిన రాణాప్రతాపసింహుని యుజ్జ్వల చరిత్రము ఈనాటకమున మనోహరముగ చిత్రింపఁబడినది. జోషీబాయి ఆత్మత్యాగము, శక్తిసింహుని విచారపరివర్తనము, మేహరున్నిసానిస్వార్థభావము చదివితీరవలయును. ఇందలి వచనమును పద్యములును వీరరసమును వర్షింపును. వెల రు 1—4—0

—* భీష్మ *—

త్యాగమూర్తియగు భీష్ముని చరిత్రము నింత యుజ్జ్వలముగ నేనాట్యకారుఁడును చిత్రింపలేదు. శృంగారవీరహాస్యములు హృదయము నాకర్షించును. పద్యములు హృద్యములు. గేయములు కర్ణపేయములు. వెల రు 1—4—0

| | |
|---|---|
| | రూ. అ. పై. |
| అర్ధానుస్వార శకటరేఫ చంద్రిక | 0-6-0 |
| సాసూను వైద్యశాలలోని గాంధిమహాత్ముఁడు | 0-1-6 |
| మయూరధ్వజ చరిత్రము (హరికథ) | 0-8-0 |
| శుద్ధాంధ్రనిర్వచన శతకంఠరామాయణము | 1-4-0 |
| శ్రీపూర్ణ రామాయణము (హరికథ) | 1-8-0 |
| సంఘసంస్కార సమస్య (పి. సి. రే) | 0-2-0 |
| శ్రీ మద్రామాయణాద్భుతోత్తరకాండము | 1-4-0 |
| సాత్రాజితీ పరిణయము | 0-12-0 |
| జగన్నాథీయము | 0-8-0 |
| శ్రీశైల హనుమచ్ఛతకము | 0-1-0 |
| బాలశతకము (స్త్రీనీతులు) | 0-1-0 |
| కన్యావిక్రయము | 0-2-0 |
| వరవిక్రయము | 0-3-0 |
| యోగసారము (వేదాంతము) | 0-4-0 |
| పరమేశ స్తుతి కదంబము | 0-4-0 |
| హరి స్తుతి కదంబము | 0-2-0 |
| దుర్గ (అమూల్యము) | |
| హిందీ తెలుఁగునిఘంటువు (జం. శి. శాస్త్రిగారు) | 2-0-0 |
| ఆంధ్ర హిందీ నిఘంటువు ,, | 1-0-0 |
| హిందీ తెలుఁగు వ్యాకరణము ,, | 0-14-0 |
| నేత్రవిధాన చంద్రిక | 0-2-0 |

చిరునామా:—ఆంధ్ర గ్రంథ రత్నాకరము,

గుడివాడ, కృష్ణాజిల్లా.



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA121B167 |
| పుస్తకం పేరు | ప్రేమ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 61 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 49 ,ci |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | thasin |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |